

నోరూరించే మధురమైన

# కొకనక కుక్కీస్



అసలైన కొబ్బరితో చేసినది

ఫ్లేవర్సతో కాదు



న్యూట్రిన్
కొకనక
కుకీబస్






# ANNOUNCING THE



**The first six books, splendid in their content, press, marking the Golden Jubilee of Chanda**




A novelette on three lads befriending an unusual stranger – and their strange adventure, in a village turned into an island by flood.




A fairytale novella opening up into fascinating worlds and introducing gripping characters – rich with 42 imaginative illustrations.




A second selection of stories from the immortal Jatakas, unforgettable for their moral, wit, and wisdom.

**How to get the books at an easy price.**

If you are a subscriber to Chandamama (in any language) between the ages of 6 and 16, you are eligible to the membership of the Chandamama Young Scholars' Club. If you subscribe to Chandamama (in any language) before May 1996, the offer is open to you. You can fill up the form given here on the right side and mail it to us, while sending a token fee of Rs. 50. either by M.O. or by a bank draft drawn in the name of CHANDAMAMA YOUNG SCHOLARS' CLUB. You can then order all or any number of these books at much less than their original price. You get a handy gift of a School Companion Note Book and a decent badge.

What is more, you can participate in talent contests and different activities which the Club proposes to hold in the future.



# CHANDAMAMA BOOKS

llustrations and production–are soon to roll out of the
nama. Written by: Manoj Das. Illustrated by Sisir Datta




A selection of legends and parables, some of which are believed to have been narrated by the Buddha, their radiance even now undiminished.




A garland of gems from the great treasure of India's folklore and ancient fiction. Each story has a message, as relevant today as it was ever before.




An invitation into the delightful world of ancient tales, legends and parables. Each story enriches us with prudence and helps us understand life better.

**MEMBERSHIP FORMALITIES WILL BE PROCESSED ONLY BY END OF FEBRUARY 1996.**

MEMBERSHIP CARD







School Companion Note Book




BADGE

NOTE BOOK

Dear Sir,

Please enrol me a member of the Chandamama Young Scholars' Club.

My Chandamama subscription No. is..............................

I am sending my Membership fee of Rs. ...................... by M.O./Draft.

I look forward to my acceptance - gift.

Full Name : .................................................. Signature

Name of Parents : ..................................................

Mailing Address : ..................................................

Permanent Address : ..................................................

Date of Birth : ..................................................

Class : ...................... School ..................................................




# చందమామ

సంస్థాపకుడు : 'చక్రపాణి'    సంచాలకుడు : నాగిరెడ్డి

## నూతన శతాబ్దం వచ్చేలోగా!

ఈనాటి నూతన సంవత్సరంతో పాటు, రానున్న నూతన శతాబ్దం గురించి కొంత ఆలోచిద్దాం. మరొక నాలుగేళ్ళలో ప్రపంచం ఇరవైయవ శతాబ్దానికి వీడ్కోలు చెప్పి, ఇరవై ఒకటవ శతాబ్దానికి స్వాగతం పలుకుతుంది. నూతన శతాబ్దం సరికొత్త సంపదలనూ, శాంతినీ తీసుకురాగలదని ప్రపంచ ప్రజలు ఎదురుచూస్తున్నారు.

వెనక్కు వెళుతూన్న ఇరవైయవ శతాబ్దం రెండు ప్రపంచ యుద్ధాలను చూసింది. ప్రపంచ దేశాలన్నీ కూడా ఈ యుద్ధాలలో ప్రత్యక్షంగానో, పరోక్షంగానో పాల్గొని కష్టనష్టాలు అనుభవించాయి. మన దేశం రెండు యుద్ధాలలోనూ బ్రిటిష్ పక్షం వహించి, సైనికులను పంపింది.

ఇరవైయవ శతాబ్దారంభం నుంచే మనదేశంలో పరాయి పాలన పట్ల వ్యతిరేకత బయలుదేరి, జాతీయ స్వాతంత్ర్యోద్యమంగా రూపు దాల్చింది. గాంధీజీ నాయకత్వంలో సాగిన జాతీయ పోరాటం ఫలితంగా స్వాతంత్ర్యం సిద్ధించింది.

మనకు స్వాతంత్ర్యం సిద్ధించి దాదాపు అర్ధ శతాబ్దం కానున్నది. ప్రపంచంలోనే అతి పెద్ద ప్రజాస్వామ్య దేశంగా మన దేశానికి పేరున్నది. అయినప్పటికీ మన దేశ జనాభాలో మూడో వంతు ప్రజలు ఇంకా పేదరికంతో బాధపడుతున్నారు. సగానికి పైగా నిరక్షరాస్యులుగానే కాలం వెళ్ళబుచ్చుతున్నారు. కనీసం వచ్చే శతాబ్దంలోనైనా మన దేశం నుంచి ఈ రుగ్మతలను రూపుమాపాలి. రానున్న నాలుగు సంవత్సరాలలో పేదరికాన్ని, నిరక్షరాస్యతను నిర్మూలించడమే ప్రధాన లక్ష్యంగా మన నూతన సంవత్సర నిర్ణయాలు తీసుకోవాలి.

చందమామ పాఠకులందరికీ నూతన సంవత్సర శుభాకాంక్షలు అందజేస్తున్నాము.

సంపుటి : 98    జనవరి '96    సంచిక: 1

విడిప్రతి : 5.00    సంవత్సర చందా : 60.00

CTD-V-Add

# వనిత

## ఉగాది కథల పోటీ!

### రూ. 3000 విలువైన బహుమతులు!

రానున్న 'ధాత' ఉగాది పండుగ సందర్భంగా కథల పోటీని నిర్వహిస్తున్నాము. ఈ పోటీకి సంబంధించిన వివరాలు ఈ క్రింద పొందుపరచాము. అయితే ఈ కథల పోటీలో విశేషం - మొదటి, రెండవ ... యిలా బహుమతులు అంటూ వుండవు. పోటీకి వచ్చిన కథల్లో న్యాయనిర్ణేతలు ఉత్తమమైనవి అని భావించిన ఐదు కథలు ఎన్నిక చేసి,

**ఒక్కొక్క కథకి రూ. 600/- చొప్పున బహుమతి**గా పంపుతాము.

అలా ఎన్నికైన ఐదు కథలలో అత్యుత్తమమైన కథకి మరో బహుమతి వుంటుంది.

అయితే ఆ ఎన్నికకి,

### పాఠకులే న్యాయనిర్ణేతలు!

ఆ ఐదు కథలూ చదివి వారికి అందులో ఏ కథ బాగా నచ్చిందో విశ్లేషణాత్మకంగా పాఠకులు రాసి పంపాలి. అలా వచ్చిన వాటిల్లో పాఠకుల ఆదరణ విశేషంగా చూరగొన్న కథకి అదనంగా -

### రూ. 1,000/- బహుమతి!

ఇక పాఠకులకీ ఓ బహుమతి వుంది. చక్కటి విశ్లేషణతో రాసిన పఠితకు

### రూ. 116/- బహుమతి!

నిబంధనలు :

* కథ తెలుగు వారి జీవితానికి సంబంధించినదై వుండాలి. స్త్రీ వాద ఇతివృత్తంతోనే వుండనవసరంలేదు.
* అనువాద రచనలు పంపకూడదు. కథ తమ స్వంతమేనని హామీ పత్రం జతపరచాలి.
* కథ ఫుల్ స్కేప్ సైజులో 6 పేజీలకు తగ్గకుండా 8 పేజీలకు మించకుండా వుండాలి. (పేజీకి 30 లైన్లు - కనీసం) కాగితానికి ఒకవైపే రాయాలి:
* రచనలు - కథల పోటీ, 'వనిత', చందమామ బిల్డింగ్స్, వడపళని, మద్రాసు - 600 026 చిరునామాకి ఫిబ్రవరి 5, 1996లోగా చేరేలా పంపాలి.
* ఈ పోటీలో స్త్రీ, పురుషులిరువురూ పాల్గొనవచ్చు.

వార్తలు - విశేషాలు:

# పోలియో రహిత ప్రపంచం

పసిపిల్లలకు వచ్చే పోలియో, వాళ్ళను జీవితాంతం వికలాంగులుగా చేసే భయంకరమైన వ్యాధి. ఆ వ్యాధి సోకిన పిల్లల తల్లిదండ్రులకు కలిగే బాధ చెప్పనలవి కానిది. అనారోగ్య పరిసరాలలోని వ్యాధి క్రిములు శరీరంలోకి ప్రవేశించడం వల్ల వెన్నెముకలో వాపు ఏర్పడుతుంది. అది నాడీమండలాన్ని దెబ్బ తీసి, కండరాలను అదుపు చేసే శక్తిని కోల్పోయేలాగా చేస్తుంది. అవ్యాధిగ్రస్తులయిన పిల్లలు కాళ్ళు చేతులను సక్రమంగా ఉపయోగించుకోలేకపోతారు. ఈ వ్యాధివల్ల ఒక్కసారి దెబ్బతిన్నట్టయితే నయం చేయడం సాధారణంగా సాధ్యం కాదని చెబుతారు. అందువల్ల ఆ వ్యాధి రాకుండా జాగ్రత్తపడడం ఒక్కటే మార్గం!

1954వ సం॥లో అమెరికాకు చెందిన జోనాస్ ఎడ్వర్డ్ సాక్ అనే సుప్రసిద్ధ మైక్రో బయోలజిస్ట్ - పోలియో నిరోధక టీకాను కనుగొన్నాడు. దీనిని సూది ద్వారా, నిర్ణీత వయోపరిమితి లోగా పిల్లలకు ఇవ్వాలి. ఈ టీకాలద్వారా చాలామంది పిల్లలు పోలియో వాత పడకుండా తప్పించుకున్నారు. దీని ద్వారా ప్రపంచం నుంచి పోలియోను నిర్మూలించ వచ్చని గ్రహించారు. అయితే, ఈ 'సాక్ వ్యాక్సిన్' ఏ కొందరికి మాత్రమే లభించి లక్షలాది మందికి అందుబాటులో లేకుండా పోయింది.

కొన్ని సంవత్సరాల తర్వాత, అమెరికాకు చెందిన ఆల్బర్ట్ బ్రూస్ శాబిన్ అనే మరొక మైక్రోబయోలజిస్ట్ పోలియో డ్రాప్స్‌ను కనుగొన్నాడు. 'శాబిన్ వ్యాక్సిన్' అనే చుక్క మందు పలువురికి అందుబాటులోకి వచ్చింది. వివిధ దేశాల ప్రభుత్వాలు, ఈ వ్యాక్సిన్‌ను తెప్పించి ఆయా దేశాలలోని పిల్లలకు వేయడం ప్రారంభించాయి. ఈ మందును పిల్లలకు నోట్లో రెండు చుక్కలు వేస్తే చాలు. అయితే, అది మూడేళ్ళవయసు లోపలే వేయాలి. అది కూడా ఒక పద్ధతి ప్రకారం నిర్ణీత సమయాలలో వేయడం చాలా ముఖ్యం.

రెండు దశాబ్దాలకు పూర్వం అప్పటి మహమ్మారిగా భావించిన మశూచిని నిర్మూలించడానికి ఇటువంటి ప్రయత్నమే చేసి విజయం సాధించారు. 1995వసం॥ నాటికి దాదాపు 145 దేశాలు తమను పోలియో రహిత దేశాలుగా ప్రకటించుకున్నాయి. భారతదేశం, ఇంచుమించు 70 దేశాలతోపాటు, ఇంకా పోలియోను నిర్మూలించడానికి పోరాడుతున్నది.

ప్రపంచం మొత్తం మీద ఉన్న పోలియో వ్యాధిగ్రస్తులలో సగం మందికిపైగా మనదేశంలోనే ఉన్నారు. కాబట్టి, ఈ విషయంలో ప్రపంచం దృష్టి మనదేశం మీదే ఉన్నది. మన ప్రభుత్వం కూడా ఈ పరిస్థితిని గుర్తించి, ఎలాగైనా పోలియోను నిర్మూలించాలన్న ఉద్దేశంతో డిసెంబర్ 9, జనవరి 20 ఈ రెండు రోజులను జాతీయ పోలియో నిరోధక దినాలుగా ప్రకటించింది. ఆ రెండు రోజులలో మూడేళ్ళలోపు పిల్లలను సమీపంలో ఏర్పాటు చేసే ఆరోగ్య శిబిరాలకు తీసుకుపోయి, ఉచితంగా రెండు పోలియో చుక్కలు వేయించమని తల్లిదండ్రులను కోరింది. అలా పోలియో చుక్కలు ఇవ్వవలసిన పిల్లలు మన దేశంలో దాదాపు 750 లక్షల మంది ఉన్నారు. గత డిసెంబర్ 9వ తేదీ కొన్ని వేల మందికి తప్ప అందరికీ పోలియో చుక్కలు వేయడం జరిగింది. ఈ జనవరి 20వ తేదీ మరొక్కసారి రెండు చుక్కలు వేయించాలి. డిసెంబర్ 9వ తేదీ వేయించని పిల్లలకు కూడా ఆ రోజు తప్పకుండా వేయించాలి.

ప్రభుత్వ సంస్థలతోపాటు, మరికొన్ని ప్రభుత్వేతర సంస్థలు కూడా ఈ కార్యక్రమం విజయవంతం కావడానికి తమవంతు సహాయ సహకారాలు అందజేస్తున్నాయి. ఈ కార్యక్రమాలను ఇదే ఉత్సాహంతో మరో మూడేళ్ళు కొనసాగించినట్టయితే, మన దేశాన్ని పోలియో రహిత దేశంగా చేయవచ్చు నని భావిస్తున్నారు.

ఈ విషయం గురించి మీరు కూడా మీ స్నేహితులకూ, తల్లిదండ్రులకూ, ఇరుగుపొరుగువారికీ తెలియజేయండి. ప్రపంచంనుంచి పోలియో వ్యాధిని నిర్మూలించడానికి సహకరించండి!



# కోరిక - అవసరం

విదేహదేశపురాజు ఒకరాత్రి మారువేషంలో నగరంలో తిరుగుతూ,ఒకచోట కాలికి రాయి తగిలి క్రిందపడ్డాడు. తలకు, కాలికి గాయమయింది. పక్కనే వున్న పేదవాడొకడు చటుక్కున రాజును లేవదీసి ఒక చెట్టు కిందికి చేర్చాడు. తర్వాత తనకు తెలిసిన ఆకులేవో సేకరించి పసరు పిండి రాజు గాయాలకు పూశాడు.

రాజుకు తొందరగానే ఉపశమనం కలిగింది. ఆయన చాలా సంతోషించి, పేదవాడికి కృతజ్ఞతలు తెలుపుకుని వాడి వివరాలడిగాడు.

"పేదవాణ్ణి. చెప్పుకో తగ్గ వివరాలేమి వుంటాయి?" అన్నాడు పేదవాడు.

"వివరాలు కాకపోతే కోరికలుంటాయి కదా! అవే చెప్పు. తీరాలని మనస్ఫూర్తిగా ఆశీర్వదిస్తాను.నాఆశీర్వాదంతప్పకఫలిస్తుంది," అన్నాడు రాజు.

"ఫలిస్తే గొప్ప విశేషమే! ఎందుకంటే, ఈ దేశపు రాజు కావాలన్నది నాకోరిక," అన్నాడు పేదవాడు.

"ఎవరైనా డబ్బు కోరుకుంటారు.కీర్తి కోరుకుంటారు. సుఖాలను కోరుకుంటారు. రాజైనవాడు ఈమూడింటికీ దూరమవుతాడని నీకు తెలియదా?" అన్నాడు రాజు నవ్వుతూ.

"అదెలా?" అన్నాడు పేదవాడు ఆశ్చర్యపోతూ.

"రాజుకు డబ్బుంటుంది. కానీ అది ప్రజాధనం. కీర్తి వుంటుంది. అంతకు మించిన అపకీర్తి వుంటుంది. సుఖాలుంటాయి. కానీ వాటికి మించిన బాధ్యతలుంటాయి. అందువల్ల ఈ మూడూ సామాన్యుణ్ణి సుఖపెట్టినట్లు రాజును సుఖపెట్టవు," అన్నాడు రాజు.

"నువ్వు చెప్పింది నిజంలాగే తోస్తున్నది. నాకు బాధ్యతలంటే మహా చిరాకు. అవి లేకపోవడమే పెద్ద సుఖం. డబ్బుంటావా —

జొన్నలగడ్డ రామలక్ష్మి

ఈరోజుంటుంది, రేపు పోతుంది. ప్రతి కీర్తికీ వెనుక అపకీర్తి వుంటుంది. అయితే నేను రాజును కావాలనిఎందుకనుకున్నానంటే— ఎవరైనా ముఖం మీద పొగుడుతూంటే ఎంతో బాగుంటుంది. రాజు మీద ఎందరో కవులు కావ్యాలల్లి చెబుతారు. రాజు కాబట్టే వాళ్ళా కావ్యాలల్లుతారు. సామాన్యుడికా అదృష్టం లేదుకదా!" అన్నాడు పేదవాడు.

వాడి మాటలకు రాజు నవ్వి, "అంతేకదా! అలాంటదృష్టం కలగాలని నీకు దీవెన ఇస్తున్నాను. నాదీవెన తప్పక ఫలిస్తుంది," అన్నాడు.

పేదవాడు పెద్దగానవ్వి, "ముందు నువ్వు జాగ్రత్తగా దారి చూసుకుని నడు. ఎదుటి వాళ్ళను దీవించినంత ఫలం," అని అక్కణ్ణించి కదిలాడు. రాజువాడిననుసరించి వెళ్ళాడు. ఆ పేదవాడికొక పూరిగుడిసె వుంది. అందులో ఒక్కడూ వుంటున్నాడు.

మర్నాడు రాజు పంపగా ఒకకవి, ఆ పేదవాడింటికి వెళ్ళాడు. ఆయన్ని చూసి పేదవాడాశ్చర్యపడి, "అయ్యో, తమరు నా ఇంటికి వచ్చారు. విశేషమేమిటి?" అని అడిగాడు.

"నీ మీద కావ్యం రాయాలని వచ్చాను," అన్నాడు కవి.

"నా మీద కావ్యం రాస్తారా, నాలో ఏం విశేషముంది?" అన్నాడు పేదవాడు ఆశ్చర్యానందాలతో.

"నీ గురించి చెప్పు, విశేషాలు నేను పట్టుకుంటాను," అన్నాడు కవి.



పేదవాడు పుట్టగానే తండ్రిపోయాడు. పదేళ్ళు వచ్చేసరికి తల్లిపోయింది. వాడి నెవరింట వుంచుకుంటే వారికి నష్టం జరుగుతున్నదని, చివరకు కొందరు పెద్దమనుషులు, వాడికి ఈ పూరి గుడిసె కట్టించి ఇచ్చారు. వాడు అడవికి వెళ్ళి పుల్లలేరుకు తెచ్చి అమ్ముకుంటాడు. ఆ డబ్బుతో ఏ రోజు తిండి ఆ రోజుకొనుక్కుని తింటాడు.

"రోజూ అడవికి వెళతావా! అయితే అక్కడ సాహసకార్యాలేమైనా చేశావా?" అని అడిగాడు కవి.

"ఒకే ఒక్కసారి నక్క కనిపించింది. పారిపోయి వచ్చాను. ఆ తర్వాత రెండు రోజులు అడవికి వెళ్ళలేదు. కానీ రోజులెలా గడు



కావ్యాలేమైనా చదువుకున్నావా?" అని అడిగాడు.

"కష్టపడి పని చేసేవాణ్ణి. ఏమైనా చదవాల నుకుంటే నిద్ర వస్తుంది. హాయిగా నిద్ర పోతాను," అన్నాడు పేదవాడు.

"అసలు నీకు చదువంటూ వచ్చా?" అని అడిగాడు కవి విసుగ్గా.

"ఎందుకు రాదు? కావ్యాలు కూడా చదివి అర్థం చేసుకోగలను!" అన్నాడు పేదవాడు.

కవి ఆశ్చర్యపోతూ, "ఆహాఁ, ఇది చాలా పెద్ద విశేషమే! నీ అంత పేదవాడికి కావ్యాలు చదివి అర్థం చేసుకోవాలన్న అభిరుచి వుండడం మెచ్చుకో తగ్గది," అన్నాడు.

"అభిరుచి వుండకపోతే ఎలా మరి! రేపు ఎవరైనా నామీద కవిత్వం చెబితే అర్థం చేసుకోవాలిగదా!" అన్నాడు పేదవాడు.

స్తాయి. మళ్ళీ వెళ్ళడం మొదలు పెట్టాను," అన్నాడు పేదవాడు.

"నీలో దయా ధర్మ గుణాలెక్కువ. కష్టాల్లో వున్నవారికి సాయపడుతూంటావు కదా!" అని అడిగాడు కవి.

ఇందుకు పేదవాడు చిన్నగా నిట్టూర్చి, "నాకే బోలెడు కష్టాలు. ఇతరులకేం సాయపడ తాను; అయితే, తీరిగ్గా వున్నప్పుడు తప్పక ఇతరులకు సాయం చేస్తాను. అందుకు దయా ధర్మాలు కారణం కాదు. దేవుళ్ళు మారువేషాలతో భక్తుల్ని పరీక్షిస్తారట! అలాంటి పరీక్షలో నెగ్గి గొప్పవాణ్ణి కావాలని నా కోరిక!" అన్నాడు. కవి అయిష్టంగా తలూపి, "తీరిగ్గా వున్నప్పుడింకా ఏం చేస్తూంటావు?

కవి విసిగిపోయి, "ఓరిముదనష్టపు వాడా! నువ్వు అన్ని విధాలా దరిద్రుడివి. నీ వంటి వాడి మీద కవిత్వం చెప్పవలసి రావడం నా దౌర్భాగ్యం," అంటూ అప్పటికప్పుడు వెంట తెచ్చుకున్న తాళ పత్రాల మీద చిన్న కావ్యం ఒకటి రాసి, వాడికి ఇచ్చి వెళ్ళాడు.

పేదవాడా కావ్యాన్ని చదువుకున్నాడు. అందులో నూరు పద్యాలున్నాయి. అన్నీ పేదవాడి మీదే! పేదవాడిని గురించిన ఎన్నో పొగడ్తలు ప్రతి పద్యంలోనూ వున్నవి.

ఆ రోజు నుంచీ పేదవాడు రాత్రి పూట, తన గుడిసె ఎదురుగా వున్న చెట్టు క్రింద

గుడ్డి దీపం ఒకటి పెట్టుకు కూర్చుని దారిన పోయే వారిని పిలిచి పద్యం చదివి వినిపిస్తూ, "ఈ పద్యం ఎవరి మీదోతెలుసా, నా మీదే!" అని గర్వంగా చెబుతూండేవాడు.

విన్న వాళ్ళు ఆశ్చర్యపడి, "ఇంత గొప్పగా పద్యం రాయగలిగి వుండీ, నీ మీద రాశాడంటే – ఆకవి మహాదరిద్రుడై వుండాలి. అలాంటి కవికి నీ మీద కవిత్వం చెప్పవలసిన దుర్గతి పట్టినందుకు, ఈ దేశపు రాజును ఇంకా అనాలి," అనేవారు.

ఈ విశేషాలన్నీ ఎప్పటికప్పుడు రాజుకు చేరుతూనే వున్నాయి.

ఒక రోజు రాత్రి ఆయన ఎప్పటిలాగే మారువేషం వేసుకుని, పేదవాడు కూర్చున్న చెట్టు ముందుకు వచ్చి కావాలనే పడి పోయాడు. కానీ పేదవాడు ఆయనను లేవ దియ్యలేదు. అలా చెట్టు కిందనే కూర్చున్నాడు.

కాసేపటికి రాజు తనంతట తనే లేచి వెళ్ళి పేదవాడితో, "ఇది వరలో నిన్నొకసారి దీవించాను. నువ్వు కోరింది జరిగింది. ఇప్పుడు నాకు సాయపడి లేవనెత్తి వుంటే, నీ కోరిక మరేదైనా తీర్చాలనుకున్నాను. నువ్వు నాకు సాయపడలేదు. గొప్ప అదృష్టాన్ని పోగొట్టుకు న్నావు," అన్నాడు.

"అమ్మో! నీ దీవెన అంటే నాకు భయం," అన్నాడు పేదవాడు.

"ఎందుకని?" అని ప్రశ్నించాడు రాజు.

పేదవాడు ఒకక్షణం తలగోక్కుని, "నేనేదో తెలివి తక్కువ కోరిక కోరితే మాత్రం, నువ్వు తెలివైన వాడివి కదా — నాకు సంతోషం



కలిగించే పని చేయొచ్చుకదా! అలా చేయకుండా నేనడిగిందే జరగాలని దీవించావు. కవి వచ్చి కావ్యం రాసిస్తే నాకడుపు నిండుతుందా? ఆ కావ్యాన్ని నేనేం చేసుకోను? అది పదిమందికీ చదివి వినిపిస్తూంటే, అంతా నన్ను చూసి నవ్వుతున్నారు. కవినీ, ఈ దేశపు రాజునూ తిడుతున్నారు. పోనీ కవి సంతోషించాడా? ఇలాంటి దిక్కుమాలిన పని చేయవలసి వచ్చిందని, నన్ను నానా మాటలూ అంటూనే, ఈ కావ్యం రాసి నా ముఖాన కొట్టి వెళ్ళాడు. నీ దీవెన వల్ల ఒక్కరంటే ఒక్కరు కూడా సంతోషించలేదు," అన్నాడు.

"ఆ రోజున నువ్వు అన్నీతెలిసిన వాడిలా మాట్లాడావు. మరి తెలివైన కోరిక ఎందుకు కోరుకోలేదు?" అన్నాడు రాజు చిరాగ్గా.

పేదవాడు దీనంగా, "అయ్యా! కోరికల విషయంలో మనిషికి తెలివి లేదనే భగవంతుడు, మనిషికేది మేలు చేస్తుందో తెలుసుకుని ఇచ్చాడు. మనిషి చావు వద్దంటాడు. కానీ చావే కదా జీవితానికర్థమిచ్చేది! మనిషి రోగం వద్దంటాడు. ఆరోగ్యసుఖాన్ని రోగమే కదా తెలియజేస్తుంది? మనిషి నొప్పి వద్దంటాడు. నొప్పి లేకపోతే మనిషి గాయాన్నెలా గుర్తించి చికిత్స చేయించుకోగలడు? అంతగా తన మేలేదో తెలియని మనిషికి నచ్చని వెన్నో దేవుడు మనిషికిచ్చాడు — మనిషి సుఖం కోరి! నువ్వు దేవుడివని నమ్మి తెలివి తక్కువగా నేనేదో కోరితే, నువ్వు నాకదే ఇచ్చావు. నీలో శక్తి వుంది కానీ నువ్వు దేవుడివి కాదు. నీ దీవెన వల్ల ఇప్పుడు నాలో ఉపకారగుణం కూడా నశించి, ఇతరులకు సాయపడడం మానుకున్నాను," అన్నాడు.

అమాయకంగా అన్న పేదవాడి ఆ మాటలలో, తనకు హెచ్చరిక వినిపించింది రాజుకు. మర్నాడే ఆయన పేదవాడికి పని కల్పించి జీవితం సుఖంగా గడిచిపోయే ఏర్పాటు చేశాడు. రాజ్యంలోని మిగతా ప్రజల విషయంలో కూడా, వారి వారి కోరికలను బట్టి కాక — అవసరాన్ని బట్టి సాయపడుతూ, క్రమంగా తనంతటి గొప్ప రాజు లేడనిపించుకున్నాడు.





# బందిపోటు రాజు

ఒకానొకప్పుడు, వింధ్య పర్వత ప్రాంతాల్లో చాలా చిన్న చిన్న రాజ్యాలుండేవి. అందులో, అలకనంద అనే దానికి అమరసింహుడు రాజు. అతడి తండ్రి, అమరసింహుడు ఇరవై ఏళ్ళ వయసువాడై వుండగా కాలధర్మంచెందాడు. అతడికి పొరుగున వున్న చిన్న రాజ్యాలను జయించి చక్రవర్తిననిపించుకోవాలనే కోర్కె వుండేది. అయితే, అందుకు తనకున్న అతి స్వల్పమైన సైనికబలం చాలదు.

అమరసింహుడి ఆలోచనలనెరిగిన మంత్రి ధర్మపాలుడు, అతడికి రాజ్యవిస్తరణ కాంక్ష కూడదనీ, వివాహమాడి, ఉన్నరాజ్యాన్ని ప్రజానుకూలంగా పాలిస్తూ, ప్రజల చేత మెప్పు పొందమనీ హితబోధ చేస్తూండేవాడు.

కానీ, అమరసింహుడికి మంత్రి హిత బోధలు నచ్చేవి కావు. అతడు మంత్రితో, "మంత్రివర్యా! మీరలా చూస్తూండండి! అతి స్వల్ప కాలంలోనే నేను అంతులేని ధనం ఆర్జించి, దానితో పెద్ద సైన్యాన్ని తయారుచేసి, మన పొరుగున వున్నచిన్నాచితుకు రాజ్యాలను జయిస్తాను. ఆ తర్వాత, ఏ మహారాజో నన్ను తన కుమార్తెను భార్యగా స్వీకరించమని ప్రార్థించకపోడు!" అనేవాడు.

అమరసింహుడు, అంతులేని ధనార్జనకు ఇది తిరుగులేని పథకం అనుకుంటూ, ఒక ఆలోచన చేశాడు. దానిప్రకారం అతడు తన కున్న కొద్దిమంది సైనికులను చిన్న చిన్న ముఠాలుగా విభజించి, రాజ్యపు సరిహద్దుల్లో వున్న పొరుగు రాజ్యాల గ్రామాల మీద పడి దోచుకు రమ్మన్నాడు.

ఈ జరుగుతున్న బందిపోట్లు గురించి, సరిహద్దు గ్రామాల ప్రజలు తమ తమ రాజులకు విన్నవించి, బందిపోట్లు అలకనంద రాజ్య ప్రాంతం నుంచి వస్తున్నట్లు చెప్పారు. వాళ్ళు బందిపోట్లను అరికట్టేందుకు తగు ప్రయత్నాలు చేస్తామని ప్రజలకు చెప్పి పంపేశారు.

పి.ఎన్. బాల

ఈ చిన్న రాజుల్లో ఒకడైన వజ్రపురి రాజు, తన దూతను అమరసింహుడి వద్దకు వెళ్ళి సంగతి అతడికి వివరించమన్నాడు.

అలా వచ్చిన దూతకు ఎంతో మర్యాద చేసి, అమరసింహుడు, "ఈ బందిపోటు ముఠాలు మీ దేశంలోనే కాదు, మా దేశంలోనూ అఘాయిత్యాలు చేస్తున్నాయి. మన రాజ్య ప్రాంతాలన్నీ కొండలూ, అడవులమయంగా వుండడంతో వాళ్ళ ఆటలు సాగుతున్నవి. సరే, బందిపోటు ముఠాలను హతమార్చేందుకు, నా ప్రయత్నమేదో నేను చేస్తాను. మీ రాజు గారికి, ఈ సంగతి చెప్పు," అని జవాబిచ్చాడు.

మంత్రి ధర్మపాలుడు, ఈసారి అమరసింహుణ్ణి గట్టిగా హెచ్చరిస్తూ, "మహారాజా! మీ ప్రవర్తన రాజధర్మానికి విరుద్ధం. ఏదో ఒకనాడు, నిజం తెలుసుకుని పొరుగు రాజులందరూ ఏకమై, దాడికి రాగలరు'," అని చెప్పాడు.

ఇందుకు అమరసింహుడు పెద్దగా నవ్వి, "మహామంత్రీ, భయపడకండి! ఆ రాజులందరూ ఏకమయ్యేలోగా, నేనిప్పుడు కూడబెట్టిన ధనంతో వేలాదిమంది సైనికులను సమాయత్తపరిచి, వాళ్ళమీద ఎదురుదాడి చేయగలను. అపాయాన్ని శంకించకండి," అన్నాడు. ఆ తర్వాత, నెల తిరక్కుండానే వజ్రపురి రాజు, బందిపోట్ల ముఠాలను పంపుతున్నది అమరసింహుడేనని, తన వేగులద్వారా తెలుసుకుని, హఠాత్తుగా అలకనంద కోటమీద దాడి చేశాడు. ఉన్న కొద్దిమంది సైనికులూ బందిపోటు ముఠాలుగా అరణ్యాల్లో, కొండల్లో వుండి పోవడంతో, కోటను రక్షించే వారెవరూ లేకపోయారు.

రాజు అమరసింహుడు, మంత్రితో పాటు రహస్య మార్గాన కోట నుంచి తప్పించుకుని, "మహామంత్రీ! ఇప్పుడు ప్రాణరక్షణకు మనం చేయవలసిందేమిటి?" అని అడిగాడు.

దానికి మంత్రి శాంతంగా, "నేనిప్పుడు మహామంత్రినీ కాదు; మీరు మహారాజా కాదు! మీ అన్యాయార్జితం, మీకు పొరుగు రాజ్యాలను జయించి పెట్టకపోగా, మీ ప్రాణానికే ముప్పు తెచ్చింది. మీరు తక్షణం ఎటయినా పారిపొండి!" అన్నాడు.

అమరసింహుడు మారుమాట్లాడలేక దాపులనున్న కొండలకేసి పరిగెత్తాడు.






## 7

[బొందెతో పితృలోకానికి వెళ్ళి, అక్కడ గ్రీకు మృతవీరుల నెందరినో చూసి, సాంకేతికుడనే జ్ఞాని ద్వారా భవిష్యత్తులో తనకు రాగల కష్టసుఖాలు తెలుసుకుని రూపధరుడు తన అనుచరులతో గృహోన్ముఖుడై, దారిలో నాగకన్యలను తప్పించుకుని, సూర్యభగవానుడి పశువుల మందలుండే దీవిని చేరాడు. అతని అనుచరులు ఆ పశువుల జోలికి పోమని ప్రమాణం చేసినమీదట ఆ రాత్రికి ఆ దీవిలో దిగటానికి రూపధరుడు ఒప్పుకున్నాడు. — తరవాత]

గ్రీకులు తమ పడవను ఒక రేవులాటి ప్రదేశం చేర్చి ఒడ్డుకు కట్టేశారు. ఆ సమీపంలోనే మంచినీటి జల కూడా ఉన్నది. తరవాత అందరూ తీరం మీదికి వెళ్ళి, వంట చేసుకుని భోజనాలు చేశారు. అనంతరం వారు విధ్వంసిని వాతపడిన తమ అనుచరులను తలుచుకుంటూ నిద్రపోయారు.

ఆ రాత్రి మూడవ జామున బ్రహ్మాండమైన ఉప్పెన అరంభమయింది. ఆకాశమంతటా మేఘాలు కమ్మాయి. దక్షిణం నుంచి తీవ్రమైన గాలి సాగింది. గ్రీకులు తమ నౌకను ఒడ్డుకు లాగి ఒక గుహలోకి ఈడ్చారు. రూపధరుడు తన అనుచరులతో, "మిత్రులారా, మన నౌకలో మనకు బోలెడంత ఆహారమూ, పానీయాలు ఉన్నాయి. కనుక మనం ఈ దీవి మీద ఉండే పశువుల జోలికి పోవద్దు. అవి సూర్యభగవానుడివి. మనం ఆయనకు ద్రోహం చేసినట్టయితే మన ప్రాణాలు దక్కవు!



దేవతలను ధ్యానించుతూ, అలాగే నిద్రపో యాడు.

ఈలోపుగా అక్కడ గుహలో మాయావి మిగిలిన గ్రీకులతో ఇలా అన్నాడు: "మిత్రులారా, మీరంతా చాలా దీనస్థితిలో వున్నారు. అందుచేత నేనొక్క మాట చెబుతాను వినండి. ప్రాణికి ఏవిధమైన చావన్నా భయమే. అయితే అన్ని చావులకన్న పరమ నీచమైన చావు ఆకలి చావు. కనుక మీరు కొంచెం కూడా సంకోచించవద్దు, పశువులను పట్టుకువద్దాం పదండి. మనం ఏనాటికైనా ఇథకా చేరితే అప్పుడక్కడ సూర్యభగవానుడికి గొప్ప ఆలయం కడదాం. ప్రస్తుతానికి మనం ఈ పశువులను తెచ్చి, యథావిధిగా స్వర్గంలోని దేవతలందరికీ బలులిచ్చి, వాటిని తిని మన ప్రాణాలు కాపాడుకుందాం. అప్పటికీ సూర్య భగవానుడు ఆగ్రహించి, మిగిలిన దేవతలు మనని అనుగ్రహించక, నడి సముద్రంలో మనం మునిగిపోతామూ, పీడ విరగడ అయిపోతుంది. ఈ నిర్జనమైన దీవిలో ఆకలికి మాడి అనేక రోజుల పాటు క్షీణించి చచ్చేకన్న ఇన్ని ఉప్పు నీళ్లు మింగి చావటం ఎన్నో రెట్లు మేలు గదా!"

మాయావి మాటలు విని మిగిలినవాళ్లు పరమానందం చెందారు. వారు ఏమాత్రమూ సంకోచించక, వెంటనే బయలుదేరి వెళ్ళి, ఆ దీవిలో వున్న పశువులలో మంచి మంచి వాటిని ఏరి తోలుకువచ్చి, శాస్త్రోక్తంగా దేవత

అందుచేత చాలా జాగ్రత్తగా ఉండండి!" అని గట్టిగా చెప్పాడు.

అతని అనుచరులకు కూడా ఆ కారణంగా చావటం ఇష్టం లేదు; అందుచేత వారు తమ నాయకుడి హెచ్చరికను పాటించారు. నెల రోజులపాటు ఉప్పెనగాలి వీస్తూనే ఉన్నది. నౌకలో ఉన్న ఆహార పానీయాలు అయిపోయాయి. గ్రీకులు ఆహారం కోసం పక్షులను వేటాడవలసి వచ్చింది, చేపలు పట్టవలసి వచ్చింది. ఎవరి కడుపులూ నిండటంలేదు.

ఇది చూసి రూపధరుడు దేవతలను ప్రార్థించ నిశ్చయించాడు. అతను తనవారిని విడిచి దీవి లోపలికి చాలాదూరంవెళ్ళి, హెూరు గాలి తగలని ఒక ప్రశాంత ప్రదేశంలో కూచుని

లకు బలులిచ్చి వాటి మాంసంతో వంట ప్రారంభించారు.

ఈలోపుగా రూపధరుడు నిద్రలేచి తనవారిని చేరుకోవటానికి బయలుదేరి రాసాగాడు. అతను తీరానికి అంత దూరాన వుండగానే మాంసం వండుతున్న వాసన కొట్టింది. తన అనుచరులు సూర్యభగవానుడి పట్ల అత్యాచారం చేశారని అతనికి తెలిసిపోయింది. అతను వారిని మందలించాడు. కాని జరగ్గకూడని అపచారమేదో జరిగేపోయింది. పశ్చాత్తాపపడి చేయగలది కూడా ఏమీలేదు.

తాము చంపి వండుకున్న పశువులమాంసాన్ని గ్రీకులు ఆరు రోజులపాటు తిన్నారు. ఏడవ రోజుకల్లా ఉప్పెనగాలి నిలిచిపోయింది. వెంటనే రూపధరుడూ అతని అనుచరులూ, తమ నౌకను సముద్రం మీదికి తెచ్చి, అందులో ఎక్కి ప్రయాణమైనారు. కొంతసేపటికి సూర్యభగవానుడి మందలుండే దీవి కనుచూపు మేర దాటిపోయింది. ఎటుచూసినా సముద్రమూ ఆకాశమూ తప్ప ఇంకేమీ కనిపించటం లేదు.

అలాటి సమయంలో నడి ఆకాశం మీదికి ఒక కారుమేఘం వచ్చింది. పడమటి నుంచి ఒకపెట్టున భయంకరమైన హెూరుతో ప్రళయమైన గాలి విసిరింది. దాని దెబ్బకు తెరచాప స్తంభం ఫెళ్ళున విరిగి చుక్కాని పట్టేవాడి శిరస్సు మీద పడింది. వాడు చచ్చి సముద్రంలో పడిపోయాడు. అదే సమయంలో నేరుగా



పడవపైన పిడుగు పడింది. ఆ దెబ్బతో పడవ కాస్తా ఛిన్నాభిన్నమై పోయింది. రూపధరుడి అనుచరులందరూ సముద్రం వాత పడిపోయారు.

అయితే రూపధరుడికి తన నౌక తాలూకు వెన్నుదూలం దొరికింది. అతను దానికి తెరచాప స్తంభాన్ని అంటగట్టి, దానిపై తేలి వెళ్లసాగాడు. ఇంతలోనే పడమటి గాలి నిలిచిపోయి దక్షిణపుగాలి ప్రారంభమయింది. తాను మళ్ళీ సుడిగుండం వేపు వెళ్లి ఆ సుడిగుండంలో మునిగిపోవటమో, విధ్వంసిని అనే రాక్షసి వాతపడటమో జరుగుతుందని రూపధరుడు చాలా భయపడ్డాడు. అతను భయపడినట్లే తెల్లవారే సమయనికి అతని తెప్ప సుడి



గుండం వద్దకు వచ్చింది. కాని అదృష్టవశాన అతను ఆ రెండు ప్రమాదాలనూ తప్పించుకున్నాడు.

రూపధరుడు తొమ్మిది రోజులపాటు ఈ విధంగా గాలికి కొట్టుకుపోయి పదవనాటి రాత్రి ఒగీజియా అనే దీవిపై వచ్చిపడ్డాడు. ఈ దీవిపై సమ్మోహిని అనే దేవత ఒక గుహలో నివసిస్తున్నది. ఆ గుహచుట్టూ గల పరిసరాలు చాలా అందంగా వున్నాయి. గుహ చుట్టూ అడవి పొదలున్నాయి. వాటి చుట్టూ పచ్చిక మైదానాలూ, అందమైన సెలయేళ్ళూ వున్నాయి. గుహద్వారం మీదుగ ద్రాక్షతీగెలు పాకుతున్నాయి. వాటి నుంచి ద్రాక్షపళ్లగుత్తులు వేలాడుతున్నాయి.

రూపధరుడు ఆ దీవిపై అడుగుపెట్టి, తూలుతూ నడుస్తూవస్తున్న ఆ సమయంలో సమ్మోహిని అతనికి ఎదురువెళ్ళి, స్వాగతం చెప్పి, తన గుహకు తెచ్చింది. అతనికి ఆహారమూ, తాగటానికి మంచి పానీయమూ ఇచ్చింది. "నీవు ఎప్పటికీ ఇక్కడే నా భర్తగా ఉండిపోయినట్టయితే, నీకు చావూ, ముసలితనమూ లేకుండా చేస్తాను," అని ఆమె వాగ్దానం చేసింది.

ఆ దీవిలో ఆమెను ధిక్కరించి రూపధరుడు చేయగలినదేమీలేదు. అతను ఆమె ఇష్టప్రకారమే ఆమెను పెళ్లాడి అయిదేళ్ళపాటు ఆ దీవిపై వుండిపోయాడు. అయితే రోజులు గడుస్తున్నకొద్దీ అతనికి స్వదేశానికి వెళ్ళాలన్న కోరికహెచ్చిందిగాని తగ్గలేదు. అతను రోజల్లా సముద్రతీరాన దిగులుగా కూచునేవాడు.

అతను తన స్వదేశాన్ని మరిచిపోయేలాగు చేయటం తనవల్లకాదని తెలుసుకుని సమ్మోహిని ఒకనాడు అతనివద్దకు వచ్చి, "నిన్ను చూస్తే జాలివేస్తున్నది. నేను నిన్ను పంపెయ్యటానికి నిశ్చయించాను, దిగులుపడకు. లేచి చెట్లు నరికి తెప్ప ఒకటి తయారుచేసుకో. నీకు కావలిసినంత ఆహారపానీయాలిస్తాను, బట్టలిస్తాను, అనుకూల వాయువుకూడా ఇస్తాను. వాటి సహాయంతో ఇంటికి వెళ్ళిపో!" అన్నది.

ఈ మాటలు వినేసరికి రూపధరుడి శరీరం జలదరించింది. "ఇందులో ఏదో మోసం ఉన్నది. లేకపోతే ఈ మహాసముద్రాన్ని

తెప్పమీద దాటమని నువ్వు నాకు సలహా ఇయ్యవు. బాగా నిర్మించిన నౌకలకే దిక్కు లేదు. అందుచేత నువ్వు పూర్తి నమ్మతితో సహాయపడి పంపుతున్నావని నాకు నమ్మకం కలిగితే తప్ప నేను వెళ్లను," అన్నాడతను.

"నీ బుద్ధి వక్రబుద్ధి. అందుకే నీకంత అనుమానం కలిగింది. కావలిస్తే ప్రమాణం చేస్తాను. నీకు సహాయపడాలనే నా ఉద్దేశం. నాది రాతి గుండె అనుకున్నావా? నిన్ను చూస్తే నాకు చాలా జాలిగా ఉంది," అన్నది సమ్మోహిని.

ఆమె అతన్ని తన గుహకు తీసుకువెళ్లి సమస్తమైన భోజనపదార్థాలూ వడ్డించి భోజనంపెట్టింది. తరవాత ఆమె అతనితో, "నీకు ఇంటికి వెళ్ళాలని ఉండటం మంచిదేగాని, దారిలో ఎన్ని కష్టాలున్నాయో తెలిస్తే నువ్వు నన్ను విడిచివెళ్లవు. ముసలితనమూ, చావూ లేకుండా ఇక్కడే ఉండిపోతావు," అన్నది.

దానికి రూపధరుడు, "ఇంటికి వెళ్ళాలని ఎంతో కాలంగా ఎదురుచూస్తున్నాను. ఇప్పటికే ఆ ప్రయత్నంలో అష్టకష్టాలూ పడ్డాను. ఒక వేళ దారిలో నా తెప్ప మునిగిపోతే నేను పడిన కష్టాలకు మరొకటి జత అవుతుంది. అంతకన్న ఏమున్నది? నేను చాలా ఓర్పుగల మనిషిని!" అన్నాడు.

మర్నాడు తెల్లవారుతూనే సమ్మోహిని రూపధరుడికి రెండువేపులా పదును గల ఒక కంచుగొడ్డలీ, బాడితా ఇచ్చి, తనవెంట అతన్ని ఆ దీవి చివరకు తీసుకుపోయింది. అక్కడ



చాలా ఎత్తయిన చెట్లు గల తోపు ఒకటి ఉన్నది. రూపధరుడు ఇరవై చెట్లు నరికి, బాడితతో సాపుచేసి చిన్న పడవ నిర్మించాడు. దానికి ఒక చుక్కానీ, తెరచాప స్తంభమూ అమర్చాడు. తెరచాపగా ఉపయోగించటానికి పనికివచ్చే వస్త్రాన్ని సమ్మోహిని ఇచ్చింది. తెప్పపడవను రూపధరుడు సముద్రం మీదికి చేర్చాడు.

ఇదంతా నాలుగురోజులు పట్టింది. అయిదవరోజు సమ్మోహిని రూపధరుడిచేత స్నానం చేయించి, ప్రయాణానికి అవసరమైన ఆహార పదార్థాలూ, తిత్తుల నిండా మంచినీరూ, పానీయంపోసి ఇచ్చింది. రూపధరుడు తన తెప్ప మీదికి ఎక్కి చుక్కాని పట్టుకుని కూచున్నాడు.



వంతులు. వారి శవాలకు సంస్కారం జరిగింది. ఈ నడిసముద్రంలో ఒంటరిగా దిక్కులేని చావు చచ్చేకన్న, వజ్రకాయుడు చచ్చినప్పుడే నేనూ పోయి ఉంటే ఎంత బాగుండేది!" అని అతను అనుకున్నాడు.

ఇంతకూ దేవతలు అతనిపై కత్తికట్టారు. గాలి ఊపుకు చుక్కాని అతని చేతిలో నుంచి లాగేసినట్టుగా పోయింది. మరుక్షణం తెప్ప గుండ్రంగా తిరిగింది. రూపధరుడు తెప్పమీది నుంచి నీటిలో పడిపోయాడు. బరువెక్కిన బట్టలను వదిలించుకుని అతను పైకి తేలి మళ్ళీ తన తెప్పను పట్టుకుని, దానిపైకి ఎక్కి కూచున్నాడు. అలల తాకిడికి తెప్ప ఇంకా గుండ్రంగా తిరుగుతూ, సముద్రం మీద బంతిలాగా అటూ ఇటూ కొట్టుకుంటున్నది.

ఈ సమయంలో రక్షకి అనే ఒక దేవతా స్త్రీ సముద్రపు పక్షి రూపంలో ముక్కున ఒక వస్త్రం పట్టుకుని వచ్చి అతని తెప్ప అంచున వాలి, "రూపధరా, నీకు ప్రాణభయం లేదు. నిన్ను దేవతలు పీడించగలరు గాని చంపలేరు, నువ్వు ఇంటికి చేరుకుంటావు. అయితే ఈ తెప్ప కేవలం నిరుపయోగం. అందుచేత ఈ వస్త్రాన్ని నీ రొమ్ము చుట్టూ చుట్టుకుని నీటిలో దూకు. అలా చేసినట్టయితే నువ్వు మునగవు. క్షేమంగా ఒడ్డు చేరుకుంటావు కూడా!" అన్నది.

రూపధరుడికి ఆ మాటలలో కొంచెం కూడా గురి కుదరలేదు. "నాకింకా కొత్త కష్టాలు

అతనికి అనుకూలంగా మెల్లని గాలి సాగింది. రాత్రి అతను నిద్రపోక నక్షత్రాల సహాయంతో తెప్పను నడపసాగాడు. అతను సముద్రంమీద బయలుదేరేటప్పుడు సమ్మోహిని, "సప్తమహర్షులు నీ ఎడమచేతి వైపున వుండేటట్టుగా ప్రయాణం చెయ్యి," అని హెచ్చరించింది.

రూపధరుడు పదిహేడు రోజుల పాటు ప్రయాణించాక సముద్రంమీద మళ్ళీ బ్రహ్మాండమైన తుఫాను బయలుదేరింది. ఆకాశం నిండా మబ్బులు కూడాయి. ప్రచండమైన గాలి సాగింది. రూపధరుడు తన చావు దగ్గిర పడిందనుకున్నాడు.

"నేనెంత అదృష్టహీనుణ్ణి. ట్రోయ్ యుద్ధంలో చనిపోయినవారు నాకన్న ఎన్నో రెట్లు అదృష్ట

తెచ్చిపెట్టటానికి ఇది పన్నాగం లాగుంది. మిన్ను విరిగి మీదపడినా సరే నేను మాత్రం ఈ తెప్పను వదలను!" అనుకుని అతను గట్టిగా తెప్పను అంటిపెట్టుకుని కూచున్నాడు.

కాని మరి కాస్సేపట్లో పెద్ద అల వచ్చి అతని తెప్పను ముక్కలు ముక్కలుగా చేసేసింది. అతనికి ఒక చిన్న దుంగ మాత్రమే దొరికింది. గుర్రాన్ని ఎక్కినట్టు అతను దాని మీద ఎక్కి కూచుని, రక్షకి చెప్పిన ప్రకారమే ఆ వస్త్రాన్ని తన రొమ్ము చుట్టూ చుట్టుకున్నాడు. తరవాత అతను నీటిమీద బోర్లా పడుకుని, తన నిడుపైన చేతులతో ఈదసాగాడు.

అతనా కల్లోల సముద్రంలో రెండు రోజుల పాటు ఈదాడు. మూడవనాడు తెల్లవారేసరికి తుఫాను నిలిచిపోయింది. అంత దూరాన రూపధరుడికి తీరం కనిపించింది. ఇక తన కష్టాలు గడిచాయనుకుని రెట్టింపు ఉత్సాహంతో అతను తీరంకేసి ఈదసాగాడు. కాని తీరాన కూడా తనకు ప్రాణభయం ఎదురుకాబోతున్నదని అతనికి వెంటనే అర్థమయింది. ఎందుచేతనంటే ఆ తీరమంతా శిలామయం. సముద్ర కెరటాలు ఆ శిలల మీదికి ఉరికి నురుగులు కక్కుతున్నాయి. వాటి హోరు అతనికి వినిపిస్తున్నది. అలలు తనను ఆ రాళ్ళగుట్టల మీదికి విసిరికొట్టితే తన గతి ఏం కాను?

అతను అనుకున్నంతా అయింది. ఒక బలమైన అల అతన్ని అవలీలగా లేవదీసుకుని, అమిత వేగంగా రాళ్ళగుట్టల మీదికి లాక్కుపోయింది. అతను ఒక రాతిని బలంగా వాటేసుకున్నాడు. కాని ఆ అల తిరిగి వచ్చేటప్పుడు అతన్ని బలాత్కారంగా తీసుకుని మళ్లీ సముద్రం వైపు ఈడ్చింది. ఆ లాగుడుకు అతని రెండు చేతులూ ఘోరంగా దోక్కుపోయాయి.

ఈసారి రూపధరుడు తీరంకేసి ఈదటం మానేసి తీరంచుట్టూ ఈదసాగాడు. ఇలా కొంతదూరం ఈదాక అతనికి ఒక నదీముఖం ఎదురయింది. అతనికి ప్రాణం లేచివచ్చింది. తనను కాపాడమని నదిని ధ్యానిస్తూ అతను నేలమీదికి వచ్చి, వెంటనే స్పృహ తప్పి పడిపోయాడు. —(ఇంకావుంది)



# దూరం

హేలాపురం నుంచి, అత్యవసరంగా పన్నెండు మైళ్ళ దూరంలో వున్న సుగంధపురికి వెళ్ళాల్సిన అవసరం కలిగింది రాజేంద్రయ్యకు. పనివాడు రాకపోవటంతో, గుర్రబ్బండిని తనే స్వయంగా తోలుకుంటూ బయలుదేరాడు.

ఊరు దాటి రెండు మైళ్లు వెళ్ళాక, దారి పక్కన ఒక పన్నెండేళ్ళ కుర్రాడు విచారంగా నిలబడి వుండడం, రాజేంద్రయ్య చూసి, "ఏం బాబూ! అలా వున్నావేం? ఎక్కడికి వెళ్ళాలి?" అని అడిగాడు.

"మా ఊరు ఇక్కడికి రెండు మైళ్ళ దూరంలో వుంది. ఇక్కడివరకూ నడుచుకుంటూ వచ్చాను.ఇంకా నడవాలంటే కాళ్ళు నొప్పులుగా వున్నాయి," అన్నాడు.

"మీ ఊరికి నేను తీసుకువెళతానులే, బండెక్కు!" అన్నాడు రాజేంద్రయ్య.

రెండు మైళ్ళు వెళ్ళాక రాజేంద్రయ్య బండిని ఆపి, కుర్రవాణ్ణి, "ఇక్కడేనా మీ ఊరు?" అని అడిగాడు.

"కాదండి! ఇంకా మూడు మైళ్ళ దూరంలో వుంది, ఆ ఊరు!" అన్నాడు కుర్రాడు.

రాజేంద్రయ్య గుర్రబ్బండిని, మరి మూడు మైళ్ళు నడిపి, "ఇక్కడేనా మీ ఊరు?" అని అడిగాడు వ్యంగ్యంగా.

"కాదండి! ఇంకా ఆరు మైళ్ళ దూరంలో వుంది, మా మేనమామ ఊరు. మీరు నన్ను మొదట బండి ఎక్కించుకున్న చోటు నుంచి, అటు వెనగ్గా, మా నాన్నా, అమ్మా వుండే ఊరు రెండు మైళ్ళే! నేనేం అబద్ధం చెప్పలేదు," అన్నాడు కుర్రాడు.

ఇది విని రాజేంద్రయ్య నిర్ఘాంతపోయాడు.

— కోనే నాగవెంకట ఆంజనేయులు






# వాగ్దానభంగం

పట్టువదలని విక్రమార్కుడు చెట్టువద్దకు తిరిగివెళ్ళి, చెట్టు పైనుంచి శవాన్ని దించి భుజాన వేసుకుని, ఎప్పటిలాగే మౌనంగా శ్మశానం కేసి నడవ సాగాడు. అప్పుడు శవంలోని బేతాళుడు, "రాజా, నువ్వు ఎవరికో ఏదో కఠోర వాగ్దానాన్ని చేసి, దాన్ని నెరవేర్చడం కోసమే ఇంతటి కఠిన ఇక్కట్ల పాలవుతున్నావని నాకు అనుమానం కలుగుతున్నది. ఇదే నిజమైన పక్షంలో, ఎటువంటి వాగ్దానభంగం చెయ్యకుండా చివరి దాకా వుండ గలవా? ఎంతటి ప్రాజ్ఞులూ, సన్మార్గ వర్తనులూ అయినప్పటికీ, ఒక్కొక్కసారి స్వార్థానికి లొంగి, తాము చేసిన వాగ్దానాలను మానవులు తామే భంగ పరుస్తూంటారు. ఇందుకు ఉదాహరణగా, కీర్తిమతి అనే ఒక స్త్రీ — విద్యావతీ, ఒక దేశానికి పట్టపురాణీ అయి వుండి కూడా, చిత్రలేఖ అనే గంధర్వకన్యకు తాను చేసిన వాగ్దానాన్ని ఎలా భంగపరిచిందో చెబుతాను,

## బేతాళ కథలు



శ్రమ తెలియకుండా, విను," అంటూ ఇలా చెప్పసాగాడు:

కుందనదేశపు రాజు చంద్రధరుడు. ఆయన పట్టపురాణి కీర్తిమతి, ఆయనకు స్వయాన మేనమామ కూతురు. కీర్తిమతి చిన్న పిల్లగా వుండగానే, చంద్రధరుడి తల్లి, తన కోడలిని చేసుకుంటానని అన్నగారికి మాట ఇచ్చి, ఆమెను తనతో బాటు తెచ్చుకుని, చంద్రధరుడి కంటే గారాబంగా చూసింది.

అలా బాల్యం నుంచి కలిసి మెలిసి పెరిగిన కీర్తిమతీ, చంద్రధరుల మధ్య పరస్పరానురాగం మొలకెత్తి, వయసుతో బాటు వృద్ధి చెందింది. అయితే, తీరా వివాహ ప్రస్తావన వచ్చేసరికి కీర్తిమతే ఒకింత వెనక్కు తగ్గింది. దానికి కారణం వారిద్దరి రూపాల్లోని స్పష్టమైన తేడా! చంద్రధరుడిది చూపరులకు అద్భుతం అనిపించే సమ్మోహన రూపం. కీర్తిమతి అలా కాక, అతి సాధారణ రూపవంతురాలు.

చంద్రధరుడి లాంటి అద్భుత రూపం గల వ్యక్తి, కీర్తిమతిని పెళ్ళాడబోవడం చూసి, చెలికత్తెలు, "తల్లి చేసిన వాగ్దానం కోసం, చంద్రధరుడు ఇప్పుడు కీర్తిమతిని వివాహమాడినా, తర్వాత ఏ గంధర్వకన్య లాంటి రాకుమారినో వివాహమాడకపోడు!" అంటూ చెవులు కొరుక్కునేవారు.

అటువంటి సంభాషణలు ఒకటి, రెండు సార్లు చెవినపడి కీర్తిమతి, చాలా బాధ పడి, చివరకు చంద్రధరుడితో ఒకనాడు, తను అతడికి తగినదాన్ని కాననీ, తగిన సౌందర్యవతిని చూసి వివాహం చేసుకోమనీ చెప్పింది.

దానికి చంద్రధరుడు చిరునవ్వు నవ్వి, "కీర్తీ! వివేకం లేని ఎవరో మూర్ఖులు, మనిద్దరి గురించీ అసందర్భంగా చర్చించుకోవడం, నువ్వు విని వుంటావు. వాళ్ళకు తగిన సమాధానం కాలాన్నే చెప్పనీ!" అన్నాడు.

ఆ మాటలతో సర్వ సంకోచాలూ మటుమాయం కాగా, కొన్నాళ్ళ తర్వాత కీర్తిమతి, చంద్రధరుణ్ణి వివాహమాడి ఆనందంగా జీవించసాగింది. అయితే, వివాహమై సంవత్సరాలు గడుస్తున్నా సంతానం కలగకపోవడంతో, కీర్తిమతిలో క్రమంగా అసంతృప్తి చోటు చేసుకోసాగింది.

ఇటువంటి పరిస్థితుల్లో ఒక పౌర్ణమి నాటి రాత్రి కీర్తిమతీ చంద్రధరులిద్దరూ, నిండు వెన్నెల్లో నదీ విహారం చేస్తూండగా, ఆ సమయంలో ఆకాశ మార్గాన పోతూన్న చిత్రలేఖ అనే గంధర్వ కన్య వారిని చూడటం తటస్థించింది.

ఈ చిత్రలేఖ, విద్యున్మయుడనే గంధర్వ రాజు కుమార్తె. అసమాన సౌందర్యరాశిగా గంధర్వ లోకంలో ఖ్యాతికెక్కిన స్త్రీ. గంధర్వుల్లో తనకు తగిన సుందరుడైన వరుడెవరూ లేడంటూ తోసిపుచ్చిన చిత్రలేఖ, రాజసం ఉట్టిపడుతున్న చంద్రధరుణ్ణి చూసి, ఒక్కసారిగా మోహపరవశురాలైంది. వెంటనే ఆమె అదృశ్యరూపంలో వారి వెంటనే వుండి, వారు రాజదంపతులనీ, సంతానం లేక బాధపడుతున్నారనీ గ్రహించింది.




అప్పటికి మౌనంగా తిరిగివెళ్ళిన చిత్రలేఖ, ఆ తర్వాత ఒకనాడు చంద్రధరుడు ఉద్యానంలో ఏకాంతంగా వుండగా అతడి ముందు ప్రత్యక్షమై, తన గురించి చెప్పి, తనను పెళ్ళి చేసుకోమని ప్రార్థించింది.

ఊహించని ఈ సంఘటనకు ఆశ్చర్యపోయిన చంద్రధరుడు, మృదువుగా చిత్రలేఖ కోరికను తిరస్కరించాడు.

అయినప్పటికీ తన పట్టువీడని చిత్రలేఖ, కీర్తిమతిని ఏకాంతంగా కలుసుకుని, తన కోరికా, చంద్రధరుడి నిరాకరణా అంతా వివరంగా చెప్పి, "చంద్రధరుడికి నీ మీద చాలా అభిమానం వున్నది. ఆ కారణంగానే అతడు, తనకు దీటైన సౌందర్యరాశి, అందునా గంధర్వ స్త్రీ వచ్చి, వివాహమాడమని తనకు తానుగా కోరినా, నిరాకరించి, నీతోటిదే లోకమని సరిపెట్టుకుంటున్నాడు! సౌందర్యం సంగతి ఏమైనా నీ కారణంగా అతడిని కూడా నిస్సంతుగా వుండమనటం, నీకు మాత్రం న్యాయంగా వున్నదా?" అని ప్రశ్నించింది.

చిత్రలేఖ మాటలకు కీర్తిమతి మనసులో చాలా బాధపడినా, పైకిమాత్రం ఏమీ చలించక, "అదంతా సరే, ఇంతకూ నువ్వు నా దగ్గరికొచ్చి, ఇదంతా ఎందుకు చెబుతున్నట్టు?" అంటూ ఆమెను ఎదురు ప్రశ్నించింది.



"ఏమిటది?" అని అడిగింది చిత్రలేఖ ఆశ్చర్యంగా.

"ఈరోజు చైత్ర బహుళ పంచమి! ఈనాటి నుంచి సరిగ్గా ఒక సంవత్సర కాలం, నాకు గడువు ఇవ్వు. రాబోయే చైత్ర బహుళపంచమి నాటికి కూడా, నేను తల్లిని కాలేకపోతే, చంద్రధరుడు నిన్ను వివాహమాడేలా నా శాయశక్తులా కృషి చేస్తాను. ఇది నా వాగ్దానం!" అన్నది కీర్తిమతి.

"సరే, అలాగే!" అని వెళ్ళిపోయింది చిత్రలేఖ.

ఒకనాడు కీర్తిమతి అమ్మవారి పూజకు వెళ్ళి తిరిగి వస్తూండగా, ఆలయంలో ఒక మూలగా కూర్చుని వున్న ఒక వృద్ధ సాధువు, ఆమెకేసి చేయి ఎత్తి, దగ్గరకు రమ్మన్నట్టుగా సైగ చేశాడు.

కీర్తిమతి సాధువు దగ్గరకు వెళ్ళి నమస్కరించింది.

సాధువు నవ్వుతూ ఆశీర్వదించి, "పిల్లలు లేరని తీరని వ్యథ అనుభవిస్తున్నావు గదా, తల్లీ?" అని ప్రశ్నించాడు.

కీర్తిమతి అవునన్నట్టు తల వూపింది.

"ఏదీ, నీ చెయ్యి ఇలా చూపించు," అంటూ, ఆమె ఎడమచేతిని అందుకున్న సాధువు, అరచేతి రేఖల్ని పరిశీలించి, పెదవిని విరుస్తూ, "నీ చేతిలో సంతాన రేఖ ఆనవాలు కూడా లేదు, తల్లీ!" అంటూకొంచెంసేపు ఆలోచించి, "సంతానరేఖ లేకపోయినా, ఉజ్వల భవిష్యత్తు వున్న చిహ్నాలు నీ

ఆ ప్రశ్నకు చిత్రలేఖ, "అంతా సకారణంగా చెబుతున్నాను. నువ్వు నీ భర్త సుఖ సంతోషాలే ముఖ్యంగా ఎంచే నిస్వార్థపరురాలివే గనుక అయితే, నన్ను పెళ్ళాడమని అతడికి నచ్చజెప్పి, మా వివాహం జరిగేలా చూడు! ఏడాది తిరక్కుండా అతడు నా బిడ్డతోనూ, నాతోనూ ఆనందంగా గడప గలడు. నన్ను పెళ్ళాడినంత మాత్రాన చంద్రధరుడు నిన్ను చిన్నచూపుగా చూడడు సరికదా, నీ నిస్వార్థతకు నిన్ను మరింత మెచ్చుకుంటాడు. బాగా ఆలోచించు," అన్నది.

కీర్తిమతి చాలాసేపు మౌనంగా వూరుకుని, చివరకు, "అయితే, నాదొక షరతు!" అన్నది.



చేతిలో కనిపిస్తున్నవి. ఒక పని చెయ్యగలవా?" అని అడిగాడు.

"చెప్పండి, స్వామీ!" అన్నది కీర్తిమతి.

"ఈ దేశానికి ఉత్తర దిక్కున విద్రుమ పర్వత పంక్తి వున్నదని, నీకు తెలుసు గదా! ఆ పంక్తికి సరిగ్గా మధ్య భాగంలో ఒక చిన్న కనుమ వున్నది. ఆ కనుమ గుండా అవతలి వైపుకు వెళితే, వ్యోమకేశమహర్షి ఆశ్రమం వస్తుంది. ఆయన మహానుభావుడు. నువ్వూ, నీ భర్తా సరిగ్గా చైత్ర శుద్ధ పాడ్యమినాటి ఉదయానికల్లా, ఆయన దగ్గరకు వెళ్ళి శరత్కారుడు చెప్పగా వచ్చామని చెప్పండి. ఆ తర్వాత చేయవలసినదేమిటో ఆయనే వివరిస్తాడు," అన్నాడు.

ఆ మాటలతో మళ్ళీ ఆశ చిగురించిన కీర్తిమతి, "అలాగే స్వామీ! తప్పకుండా వెళతాం," అని సాధువుకు నమస్కరించి, సెలవు తీసుకుని తిరిగి వచ్చింది.

ఆ రాత్రే అంతా వివరంగా భర్తకు చెప్పిన కీర్తిమతి, "ఇదే ఆఖరి అవకాశంగా, నా అదృష్టాన్ని పరీక్షించుకోవాలని ఆశపడుతున్నాను. నాకోసం మీరు కూడా కాస్త శ్రమపడితే..." అంటూ, ఇక మాట్లాడను మాటలు రాక, మౌనంగా వూరుకున్నది.

భార్య ఉద్వేగాన్ని గమనించిన చంద్రధరుడు, "కీర్తీ, భార్యాభర్తలమైన మనం, సుఖంతో బాటు దుఃఖాన్నీ, సౌఖ్యంతో బాటు శ్రమనూ సమంగా పంచుకున్ననాడే, జీవితం ఒడిదుడుకులు లేకుండా సవ్యంగా సాగుతుంది. కోరిక మనది; ఇద్దరం శ్రమించి వెళదాం, సరేనా?" అన్నాడు.

తర్వాత, సాధువు చెప్పిన విధంగా, కీర్తిమతీ, చంద్రధరులిద్దరూ బయలుదేరి, చైత్ర శుద్ధ పాడ్యమి నాటి ఉదయానికల్లా వ్యోమకేశ మహర్షి ఆశ్రమం చేరారు. వృద్ధుడూ, కరుణామయుడూ అయిన వ్యోమకేశ మహర్షి రాజదంపతులను ఎంతో ఆప్యాయంగా పలకరించి, కుశల ప్రశ్నలు వేశాడు.

అప్పుడు చంద్రధరుడు, తమ సంతానలేమి గురించి చెప్పి, కీర్తిమతికి ఆలయంలో శరత్కారుడు కనిపించిన వైనం అంతా వివరంగా చెప్పాడు.



అంతా శ్రద్ధగా విన్న వ్యోమకేశుడు, "నాయనా, చంద్రధరా, ఏదీ నీ కుడిచేయి ఇటు చూపించు," అన్నాడు.

కొద్దిసేపు ఆ చేతిని పరిశీలించిన మహర్షి "నీ చేతిలో కూడా సంతానరేఖ లేదు, నాయనా! ఇక, శరత్కారుడు ఊహించిన ప్రకారం ఏదో అద్భుతం జరగాలి, అంతే!" అన్నాడు.

"అద్భుతమా!" అంటూ రాజదంపతులు ఆశ్చర్యపోయారు.

"అవును! వివరంగా చెబుతాను, వినండి," అంటూ వ్యోమకేశుడు ఇలా చెప్పసాగాడు:

"ఇక్కడికి మూడు యోజనాల దూరంలో అతిపురాతనమైన శివాలయం ఒకటి వున్నది. ఆ ఆలయంలో అతి ప్రాచీనమైన మామిడి చెట్టొకటి వున్నది. ఆ చెట్టుకు, సంవత్సరానికి ఒకే ఒక పండు కాస్తుంది. ఏదైనా కోరిక కలిగిన వ్యక్తి, త్రికరణశుద్ధిగా దైవప్రార్థన చేసి, మనసులోనే కావలసినదాన్ని కోరుకుంటూ దోసిలి పట్టి, ఆ చెట్టు కింద నిలబడాలి. ఆ వ్యక్తి కోర్కె ధర్మసమ్మతమైనదైతే, పండు సూటిగా వచ్చి అతడి దోసిలిలో పడుతుంది. లేని పక్షంలో పండు నేలపాలవుతుంది. ఇక ఆ పండు తిన్నా ఎటువంటి ఫలితమూ వుండదు. పండు దోసిట పడితే మాత్రం కోరిన కోరిక తప్పక నెరవేరుతుంది. రాత్రి చంద్రోదయ వేళకు అక్కడికి వెళ్ళి, మీ అదృష్టాన్ని పరీక్షించుకోండి!"

మహర్షి మాటలకు కీర్తిమతి కాస్త ఆతృతగా, "నాకు వేరే కోరికలు ఏమీ లేవు, స్వామీ! ఒక స్త్రీగా, వివాహితగా సంతానాన్ని కాంక్షించటం ధర్మబద్ధమైన కోరికే గదా?" అని ప్రశ్నించింది.

మహర్షి ఆ ప్రశ్నకు జవాబుగా చిత్రంగా నవ్వి, "ధర్మస్వరూపం చాలా సూక్ష్మమైనది, తల్లీ! దాని లోతుపాతులు పూర్తిగా తెలిసినవాడు, భగవంతుడొక్కడే!" అన్నాడు.

ఆ తర్వాత, మహర్షి చెప్పిన ప్రకారం రాజదంపతులిద్దరూ బైలుదేరి, చంద్రోదయానికి ముందుగానే మామిడి చెట్టు దగ్గరకు చేరారు. చెట్టు మీద సువర్ణఫలంలా మెరుస్తున్న మామిడి పండును చూసి, కీర్తిమతి దానికి శ్రద్ధాభక్తులతో నమస్కరించి, దోసిలి పట్టి నిలబడింది. అయితే, ఆమె ఊహించని

విధంగా చంద్రధరుడు కూడా దోసిలి పట్టి, ఆమెకు కాస్త దూరంగా నిలబడ్డాడు.

చంద్రోదయమైంది. మెల్లని కదలికతో కిందికి దిగడం ప్రారంభించి మామిడి పండు, సూటిగా వచ్చి చంద్రధరుడి దోసిలిలో పడింది.

జరిగినదానికి మొదట నిర్ఘాంతపోయిన కీర్తిమతి, తేరుకుని, చంద్రధరుడు తనకిచ్చిన పండులోని సగభాగాన్ని ఆనందంగా తీసుకున్నది. ఇద్దరూ నిశ్శబ్దంగా పండు తిన్నారు.

అప్పటిదాకా మౌనంగా వున్న కీర్తిమతి, "ప్రభూ, మీకోరిక ఏమిటో తెలుసుకోవచ్చునా?" అని ప్రశ్నించింది.

అందుకు చంద్రధరుడు భార్యతో ఇలా చెప్పాడు: "కీర్తీ! విద్యావతివీ, వివేకివీ అయిన నువ్వు, నా మాటలకూ, చేతలకూ ఆనందిస్తావనే, నా నమ్మకం. ఈ పవిత్ర వృక్షాన్ని మనం కోరబోయే కోరిక ధర్మసమ్మతమైనదై వుండాలని, మహర్షి చెప్పిన మాట గుర్తున్నది కదా? సంతానలేమి అనేది మనకు ఒక లోటు కావచ్చు! కానీ అది సృష్టి తాలూకు అధర్మం కానీ, వైపరీత్యం కానీ కాదు. అతిక్రమించరానిదని మనం గౌరవించే విధివ్రాతలోనే మార్పు కోరితే, ఆ కోరిక ఫలిస్తుందా అన్న సందేహం, నాకు కలిగింది. పేదవాడు కసితో దొంగతనం చేసి ధనమార్జించటం, నిస్సంతు అయిన భర్త, అగ్నిసాక్షిగా వివాహమాడిన స్త్రీని చులకన చేసి, సంతానం కోసమంటూ వేరొక స్త్రీని వివాహమాడటం,



ధర్మహాని కిందికే వస్తాయి. అయితే, వంశవృద్ధి కోసం అటువంటి ధర్మహానికే తలపడమని, ఈమధ్య కొన్నాళ్ళుగా నాపై ఒత్తిడి వస్తున్నది. అందుకే, ఈరోజు ఈ పవిత్ర వృక్షాన్ని ఇలా ప్రార్థించాను: ఓ ధర్మమూర్తీ! అగ్నిసాక్షిగా దంపతులమైన మేము, మా జీవిత చరమాంకం వరకూ ఆనందంగా జీవితం సాగించేలా ఆశీర్వదించు!"

భర్త మాటలకు దిగ్భ్రమ చెందిన కీర్తిమతి, తనకు సంతానం లేకపోయినా, అటువంటి వ్యక్తి భర్త అయినందుకు ఆనందంతో, గర్వంతో పొంగిపోయింది. ఆ మర్నాడే రాజదంపతులు రాజధానికి తిరిగి వచ్చారు. ఆ తర్వాత కొద్ది రోజులకు, చైత్ర బహుళ

పంచమినాడు, చెప్పిన ప్రకారం చిత్రలేఖ వచ్చి కీర్తిమతిని కలుసుకున్నది.

కీర్తిమతి ఆమెను ఆదరించి కూర్చోబెట్టి, "చిత్రలేఖా! వాగ్దానభంగం చేస్తున్నందుకు నన్ను క్షమించు. నా భర్త ఏకపత్నీ వ్రతుడు," అంటూ జరిగినదంతా వివరంగా చెప్పింది.

అంతా విన్న చిత్రలేఖ, "కీర్తిమతీ! నువ్వు చాలా అదృష్టవంతురాలివి. త్వరలోనే సంతానవతివి కాగలవు!" అని, వెళ్ళిపోయింది.

చిత్రంగానే, ఆ తర్వాత కొన్నాళ్ళకు కీర్తిమతి గర్భవతి అయి, చక్కని బిడ్డకు తల్లి అయింది.

బేతాళుడు ఈ కథ చెప్పి, "రాజా, కీర్తిమతి, చిత్రలేఖకు ఇచ్చిన వాగ్దానాన్ని భంగపరచడం స్వార్థంగానూ, సంతానరేఖ అనవాలు కూడా లేని ఆమె తల్లి కావడం చిత్రంగానూ లేవా? ఈ సందేహాలకు సమాధానం తెలిసి కూడా చెప్పలేకపోయావో, నీ తల పగిలి పోతుంది," అన్నాడు.

దానికి విక్రమార్కుడు, "కీర్తిమతి స్వార్థంతో వాగ్దానాన్ని భంగపరచలేదు. తను నిస్సంతునన్న భావం ఆమెలో దృఢపడేలోపునే, భర్త చెప్పిన ధర్మసూక్ష్మం ఆమెను నిస్సహాయురాలిని చేసింది. ఆమె తన వాగ్దానాన్ని నెరవేర్చడమంటే చంద్రధరుడు చెప్పిన ప్రకారం ధర్మహానికి పాల్పడటమే! ఇకపోతే, చంద్రధరుడి ప్రార్థనలోనే ఒక చిన్న ద్వంద్వార్థం వున్నది. ఒకటి; తమ తలవ్రాత మార్చి, తమకు సంతానాన్ని ప్రసాదించి, ఆనందంగా జీవించేలాగా ఆశీర్వదించమని. రెండు; విధివశాత్తూ సంతానం లేకపోయినా, తాము ఆనందంగా జీవించేలాగా ఆశీర్వదించమని. ధర్మసూక్ష్మాన్ని అర్థం చేసుకున్న చంద్రధరుడి ప్రార్థనలోని, ఈ సూక్ష్మమైన తాత్త్విక భావ శకలమే వారి తలవ్రాతలను మార్చింది. మంచి బిడ్డను చూసి మురిసిపోయి, ఆబిడ్డ కోరని కోరికలు కూడా తీర్చినట్టే, ధర్మాధర్మ విచక్షణాజ్ఞానం గల చంద్రధరుడి ప్రార్థన, అసాధ్యాన్ని సాధ్యం చేసింది," అన్నాడు.

రాజుకు ఈవిధంగా మౌనభంగం కలగగానే, బేతాళుడు శవంతో సహా మాయమై, తిరిగి చెట్టెక్కాడు. — (కల్పితం)

[ఆధారం : లక్ష్మీగాయత్రి రచన]



సముద్రతీర ప్రయాణాలు - 3

# బొంబాయి మార్గంలో

రచన : మీరా నాయర్ ■ చిత్రాలు : గౌతమ్ సేన్



▲ డామన్ : సరుగుడు చెట్లతో నిండిన సముద్ర తీరం

▼ దహానూ సపోటాలు



గుజరాత్, మహారాష్ట్రల మధ్య ఉన్న కేంద్ర పాలిత ప్రాంతం డామన్. ఇక్కడి 12 కి.మీ. పొడవు గల సముద్ర తీర రేఖను ఆనుకుని అందమైన పల్లెకారుల గ్రామాలూ, సరుగుడు చెట్లతో నిండిన తీరాలూ వున్నాయి. మోతీ, నానీ డామన్ దగ్గరి కోటలు పోర్చుగీసులు పాలించిన ఆ పట్టణాల గత చరిత్రకు సాక్ష్యాలుగా ఉన్నాయి. గుజరాత్ సముద్రతీరం డామన్ వద్ద ముగుస్తుంది. అక్కడినుంచి 120 కి.మీ. పొడవు గల కొంకణ తీరం ఆరంభమవుతుంది. దాని ఉత్తరాగ్రంలో ప్రశాంతమైన దహానూ తీర పట్టణం ఉన్నది. 1880వ సంవత్సరాలలో ఇరానియన్లు అక్కడికి వలస వచ్చి స్థిరపడేంతవరకు అదొక బంజరు భూమిగా ఉండేది. ఆ తరవాత దానిని ఇరానియన్లు పళ్ళ తోటలుగా మార్చారు.

దహానూ సపోటా పళ్ళకు చాలా ప్రసిద్ధిగాంచిన పట్టణం. మన దేశంలో ఇక్కడే ఎక్కువగా సపోటా పళ్ళు పండుతున్నాయి. సపోటా పళ్ళను ఇక్కడినుంచి బొంబాయికి చేరవేస్తారు. బొంబాయి నుంచి దేశంలోని వివిధ ప్రాంతాలకు పంపిస్తారు. ఇటీవల బొంబాయి నగర సమీపంలో విద్యుత్తు తయారీకి ఏర్పాటుచేసిన థర్మల్ విద్యుత్ కేంద్రం నుంచి వెలువడే కలుషిత వాయువులు

దహానూ సపోటా పంటను తీవ్రంగా దెబ్బతీస్తుందేమోనన్న అనుమానాన్ని కొందరు వ్యక్తం చేస్తున్నారు.

దహానూ, బొంబాయి మార్గమధ్యంలో నాలాసొపారా గ్రామం ఉన్నది. దీనిని పూర్వకాలంలో షొర్పారక్ అని పిలిచేవారు. అది అప్పుడు ఓడరేవుగా ఉండేది. ఇప్పుడు సుపారీ ఇక్కడి ముఖ్యమైన వ్యాపార వస్తువు. మలబార్ ప్రాంతం నుంచి దీనిని ఇక్కడికి తీసుకువచ్చి, ఇక్కడినుంచి ఉత్తర ప్రాంతాలకు పంపుతారు. ముత్తెపు చిప్పలు పట్టడం ఇక్కడి మరొక ముఖ్యమైన వృత్తి. చిప్పలనుంచి తీసిన ముత్యాలను చైనాకు ఎగుమతి చేస్తారు.



వజ్రేశ్వరి వేడి నీటిబుగ్గలు

గౌతమబుద్ధుడు ఒకానొక పూర్వ జన్మలో ఇక్కడ జన్మించాడని చెబుతారు. అనేక స్థూపాలతో పాటు చాలా బౌద్ధ శిథిలాలు ఈ ప్రాంతంలో బయటపడ్డాయి. నాలాసోపారాకు పది కి.మీ. దూరంలో దక్షిణంగా వాసైలో పూర్వకాలంలో పడవలు నిర్మించిన పోర్టు రేవు ఉన్నది. ఇక్కడి సముద్ర తీరంలో పడవల నిర్మాణానికి పనికివచ్చే కలపనిచ్చే ఖైర్, బోండా, హెూల్డ్, కలంబ, సాగ్ చెట్లు విరివిగా ఉండేవి. పోర్చుగీసుల పాలనలో అంటే 16-17 శతాబ్దాలలో ఇక్కడ పడవల నిర్మాణం అభివృద్ధి చెందింది. శిథిలావస్థలో ఉన్న కోట, క్రైస్తవ ఆలయాలు, భవనాలు ఒకప్పుడు ఇక్కడ సాగిన పోర్చుగీసుల పాలనకు మౌన చిహ్నాలుగా మిగిలి ఉన్నాయి. ఇవాళ వాసై బొంబాయి నగరానికి కాయగూరలు సరఫరా చేసే ముఖ్యమైన ప్రాంతంగా ఉంటున్నది.

బొంబాయికి 35 కి.మీ. దూరంలో ఉన్న వాసైలోని పోర్చుగీసు కోట

కన్హేరి చైత్య గుహలోని స్థూపం



ఈ ప్రాంతంలో ప్రవహిస్తున్న టాన్సా నదీ మార్గంలోనూ, దాని చుట్టు పక్కలా చాలా వేడి నీటి బుగ్గలు ఉన్నాయి. వజ్రేశ్వరి, గణేష్‌పురిలోని నీటిబుగ్గలు చాలా ప్రసిద్ధమైనవి. వాసై రోడ్ రైల్వే స్టేషన్‌కు పది మైళ్ళ దూరంలో వజ్రేశ్వరి నీటి బుగ్గ ఉన్నది. ఈ నీటి బుగ్గల చుట్టూ తొట్టెలూ, ఆనకట్టలూ నిర్మించి ఉన్నారు. సాధారణంగా ఈ బుగ్గల లోని నీళ్ళు 110-136 డిగ్రీల (ఫారెన్ హీట్) వేడిగా వుంటాయి. నీళ్ళ నుంచి గంధకం వాసన వీస్తూంటుంది. గణేష్‌పురిలోని ఒక నీటి బుగ్గలోని నీళ్ళు చేయి పెట్టలేనంత వేడిగా ఉన్నాయి.

బొంబాయి పరిసరాలలో ఉన్న బోరివ్లీ సమీపంలో కన్హేరీ గుహలు ఉన్నాయి. కన్హగిరి కొండల కారణంగా ఈ గుహలకు ఆ పేరు వచ్చింది. పశ్చిమ భారతదేశంలో ఇక్కడే అధిక సంఖ్యలో బౌద్ధ గుహలు ఉన్నాయి. ఇక్కడ 109 గుహలు ఉన్నాయి. క్రీ.శ. రెండవ – పదవ శతాబ్దం మధ్య కాలంలో బౌద్ధ సన్యాసులు నిర్మించిన శిల్పకుడ్యాలు, శిల్పాలు, స్తంభాలు, స్థూపాలు ఈ గుహలలో చాలా ఉన్నాయి. తొట్టెల నుంచి సంవత్సరం పొడవునా నీటి సరఫరా జరుగు తుంది. కొండల నుంచి వర్షం నీటినీ, మురికి నీటినీ కిందికి తీసుకు వెళ్ళడానికి భూమికి అడుగున గొట్టాలు అమర్చిన పద్ధతి బాగా పనిచేస్తున్నది.

ఈ గుహలలో దర్బారు, చైత్య గుహలు చాలా ఆసక్తికరమైనవి. దర్బారు గుహ లోపల మధ్య చతురస్రాకార మంటపంలో వరుసలు వరుసలుగా పొడవాటి రాతి ఆసనాలు ఉన్నాయి. ఇక్కడ బౌద్ధ సన్యాసులు ప్రార్థనా సమావేశాలు జరిపేవారని చెబుతారు. మహాచైత్య గుహలో బ్రహ్మాండమైన స్థూపాలూ, పెద్ద పెద్ద

కన్హేరి మహాచైత్య గుహ

కన్హేరి చైత్యగుహ దగ్గరి స్థూపం

అంబర్‌నాథ్‌లోని శివాలయం

బుద్ధ విగ్రహాలూ ఉన్నాయి. కన్హేరీకి కొన్ని కి.మీ. దూరంలో జోగేశ్వరిలో రాతి నుంచి మలిచిన శివాలయం ఉన్నది. దీనిని 8వ శతాబ్దం ఉత్తరార్ధంలో నిర్మించారు.

బొంబాయికి 54 కి.మీ. దూరంలో కల్యాణ్ సమీపంలో ఉన్న అంబర్‌నాథ్ పట్టణం కూడా అక్కడి శివాలయం వల్లనే ప్రసిద్ధి చెందింది. ఈ ఆలయం నల్లరాతితో నిర్మించబడింది. స్వయంభువుగా విశ్వసించబడే ఇక్కడి శివలింగం నేలమట్టానికి ఎనిమిది అడుగుల అడుగున ఉన్నది. పాకిస్తాన్ నుంచి సింధీ శరణార్థులు వచ్చి ఇక్కడ స్థిరపడిన తరవాత ఇది బాగా అభివృద్ధి చెందింది. బొంబాయి నగరం శివార్లలో థానే నగరం - థానే చిన్న సముద్ర శాఖను ఆనుకుని ఉన్నది.

ఈ శాఖ పొడవునా చిత్తడి నేలలు, ఉప్పు కయ్యలు ఉన్నాయి. ఒకప్పుడు ఇక్కడ ముత్యాల కోసం ముత్తెపు చిప్పలు పట్టేవారు. సన్నటి ఈ సముద్ర శాఖ థానే నుంచి ట్రాంబే వరకు దాదాపు 18కి.మీ. దూరం ఉత్తర దక్షిణంగా వ్యాపించి ఉన్నది.

ట్రాంబేలో మన దేశంలోని ముఖ్యమైన అణు పరిశోధనా కేంద్రమైన బాబా అణు పరిశోధనా కేంద్రం ఉన్నది.



బాబా అణు పరిశోధనా కేంద్రం




చామంతికి అహంభావం జాస్తి. ఆమె తన అత్తమంగమ్మనుపురుగుకన్నహీనంగాచూసేది. ఆమెకు ఇంత ముద్ద పెట్టడం ఊరికి ఉపకారం,ఏదోగొప్పధర్మకార్యంఅన్నట్టుగాభావించేది. అత్త ఏంచేసినా అపచారంగానే తోచేది ఆమెకు.

గుడికి వెళ్ళివచ్చిన అత్తమీద, "కోడలు తొందరగా గుటుక్కుమనాలని మొక్కులు మొక్కి వస్తున్నావా?" అంటూ విరుచుకుపడేది.

అలా అని ఆమె ఎటూ వెళ్ళక, ఇంటెడు పనీ చేసి వీధి అరుగుమీద కూర్చుంటే, "ఏమిటి, వచ్చేపోయే వాళ్ళను లెక్క పెడుతున్నావా? కడుపునిండా మెక్కిపిడిరాయిలా కూర్చుంటే, తిన్నది అరగొద్దూ?" అంటూ కసిరేది.

ఏదైనా ఒక పూట, అత్త మరొక ముద్ద అన్నం పెట్టమంటే, "ఏమిటేమిటీ, ఇంకా కావాలా? సరే, కడుపు పగిలేలా మెక్కు. పోయే లోపల కొడుకు ఇల్లు గుల్లచేయొద్దా, మరి!" అంటూ గుప్పెడన్నం అత్త కంచంలో విసిరికొట్టేది.

అయితే, అత్త మారు అడగని రోజు, "నీరసంతో కళ్ళు తిరిగిపడి, మహారాణీలా మంచం ఎక్కితే ఊడిగం చేయడానికి, నీ దాసీ లెవరూ లేరిక్కడ!" అంటూ గిన్నెలో వున్న అన్నమంతా, అత్త ముందున్న కంచంలో గుమ్మరించేది.

కోడలి అఘాయిత్యానికి మంగమ్మ, తనలో తాను బాధపడుతూండేది. చామంతి భర్త చలమయ్య తెలివిగలవాడే గాని ఆమెవద్ద మాత్రం నోట్లో నాలుక లేని మనిషి. పెళ్ళాం లెమ్మంటే లేస్తాడు, కూర్చోమంటే కూర్చుంటాడు. తల్లి దీనస్థితికి జాలిపడుతూ — అంతా చూసీ చూడనట్లు ఊరుకునేవాడు. ఇందుకొక కారణం — అంతగా ఆస్తిపాస్తులు లేని చలమయ్యకు కూతురునిచ్చి, అతడి చేత పూల వ్యాపారం పెట్టించింది, చామంతి తండ్రే!

మాచిరాజు కామేశ్వరరావు



తనకు వచ్చిన కల గురించి చెప్పి, "ఈ కలకు అర్థం ఏమిటో? ఈ మాయదారి పీడకలతో రాత్రి నిద్రలేదు. భయంగా వున్నది!" అన్నది.

చలమయ్య కాసేపు ఆలోచించి, ఏదో అర్థమైన వాడిలా తలపంకించి, "పగటి కలల గురించి మనం అంతగా భయపడనవ సరంలేదు. కాని, రాత్రివచ్చే కలలు మాత్రం అతి ప్రమాదకరమైనవి. అందునా, రాత్రి నాలుగో జామున వచ్చిన పీడకల నూటికి నూరు పాళ్ళు దుష్ఫలితాన్నిస్తుంది. ఇంతకూ నీకొచ్చిన కల కోడికూత ముందా, వెనకా?" అని అడిగాడు.

చలమయ్య మాటలకు చామంతి విసుక్కుంటూ, "అబ్బో! కలల శాస్త్రమంతా పడ చదివినవాడిలా మాట్లాడేస్తున్నావు! నీకు చామంతి పువ్వుకూ, బంతి పువ్వుకూ తేడా తెలీదు. నన్నేమైనా ఆట పట్టించాలనుకుంటు న్నావా?" అని అడిగింది.

చలమయ్య గంభీరంగా ముఖం పెట్టి, "ఇది ఆటలకూ, వేళాకోళాలకూ సమయం కాదు. నీ పీడకల కారణంగా నువ్వూ, భర్తగా నేనూ ఇంతింతనరాని ప్రమాదంలో చిక్కుకో పోతున్నాం. మన గ్రామానికి తూర్పున వున్న చెరువుకు ఉత్తరాన వున్న చింత తోపులో, ఒక మూగ బైరాగివచ్చి దిగాడు. ఆయన సంవత్సరంపాటు ఎక్కడెక్కడో తిరిగి, మళ్ళీ నాలుగురోజుల క్రితం ఇక్కడికి రావడం జరిగింది. ఆయన కలలకు అర్థం చక్కగా

రోజుకు ఒకసారైనా ఆమె చలమయ్యను, "ఇదుగో చూడు! ఇదంతా మా నాన్న చలవ. లేకపోతే ఈసరికి తల్లీకొడుకులిద్దరూ ఏ కూలో నాలోచేసుకుని బతుకుతూండేవాళ్ళు," అని ఈసడిస్తూండేది.

ఇలా వుండగా — ఒకనాటి రాత్రి తెల్లవారు జామున, ఒక భయంకరమైన పీడకల వచ్చి, చామంతి ఉలిక్కిపడి మంచం మీద లేచి కూర్చున్నది. ఆకలలో ఆమె, దట్టంగా మబ్బులు పట్టిన ఆకాశంలో నలుగురు మనుషులు కర్రలతో కట్టిన ఏదో ఒక సాధనాన్ని భుజాల మీద మోసుకుపోతూండడం చూసింది. వాళ్ళ వెనగ్గా ఒక వృద్ధురాలు రోదిస్తూ నడుస్తున్నది. తెల్లవారాక చామంతి, భర్త చలమయ్యకు



చెబుతాడు. ఏడాది క్రితం పెళ్ళికాకముందు, నా కొకసారి చెప్పాడు," అన్నాడు.

చామంతి ఆశ్చర్యపోతూ, "అప్పట్లో నీకూ ఏదయినా పీడకలవచ్చిందా?"అని అడిగింది.

"పీడకల కాదు, మంచి కలే!" అన్నాడు చలమయ్య.

"మంచికలా?ఏమిటది?"అన్నదిచామంతి.

"అయితే విను మరి! విసుగనిపిస్తుం దేమో,"అంటూ చలమయ్య గొంతు సవరించు కుని, "కలలో నేనొక సుగంధాలు వెదజల్లుతూ నడిచి వెళుతున్న, ఒక అందాలరాశిని అను సరించి నడుస్తున్నానట! ఆమెనన్నొక పూదోట లోకి తీసుకుపోయి, హఠాత్తుగా కనబడకుండా పోయింది," అన్నాడు.

"మంచి పనిచేసింది. అదృష్టవంతురాలు!" అంటూ చామంతి చిటికెలు వేసింది.

"అలా అడ్డు మాట్లాడకు! ఈ కల గురించి ఆ మూగ బైరాగికి చెప్పాను. ఆయన చాలా సేపు ఆలోచించి — నేను పెళ్ళి చేసుకోబోయే అమ్మాయి, నాజీవితాన్ని నందనవనం చేస్తుం దనీ, ఆమె పేరుకూడా ఒక పువ్వుపేరే అయి వుంటుందనీ, చెప్పాడు. ఆ బైరాగి చెప్పింది అక్షరాలా నిజమయింది కదా!" అన్నాడు చలమయ్య.

"నిజమే అయ్యింది. నువ్వదృష్టవంతుడివి! అది సరే, ఆ బైరాగి మూగవాడంటున్నావు. మరి, ఇదంతా ఎలాచెప్పాడు?"అని అడిగింది చామంతి అనుమానంగా.

"చిన్న పుల్లతో ఇసుకలో రాసి చూపిస్తాడు. సాయంత్రం వెళ్ళి, నీ పీడకల గురించి చెప్పి చూడు!" అన్నాడు చలమయ్య.

ఆ సాయంత్రం, చామంతి పెద్ద కేకవేసి అత్త మంగమ్మను పిలిచి, "నేను ఇంట లేనని, ఇరుగు పొరుగిళ్ళకు పెత్తనాలకు పోకు. ఇంటిని కనిపెట్టుకుని కూర్చో," అని గట్టిగా చెప్పి, బైరాగి వున్న చింత తోపుకు పోయింది.

అంతవరకూ కళ్ళు మూసుకుని వున్న బైరాగి,చామంతి సమీపించగానే కళ్ళు తెరిచి, తెల్లగా బారెడు పొడుగున్న గడ్డాన్ని వేళ్ళతో దువ్వుకోసాగాడు. చామంతి భక్తిగా బైరాగికి అడుగు దూరంలో కూర్చుని, నమస్కరించి,



ఇసుకలో రాశాడు. అది చదివి చామంతి అదిరిపడి, "అదేమిటి, స్వామీ! నేను కలలో చూసిన నలుగురు మనుషులూ, దేన్నో మేఘాల మధ్యగా మోసుకుపోతున్నారు. నరకం ఎక్కడో భూమికి దిగువనుంటుందంటారు గదా?" అని అడిగింది.

ఆ ప్రశ్నకు బైరాగి గుబురు గడ్డంలోనే చిరునవ్వు నవ్వుకుని, "నువ్వు చూసినవి మేఘాలు కాదు. కింకరులు పెట్టే హింసలకు ఓర్చుకోలేక పాపులు వదిలే నిట్టూర్పుల ఆవిరులు!" అని ఇసుకలో రాశాడు.

చామంతి ఆ మాటలు చదివి మూర్ఛ పోబోయినదల్లా తమాయించుకుని, బొంగురు పోయిన గొంతుతో, "పెళ్ళయి పట్టుమని పది నెలలు కాలేదు, స్వామీ! ఇంకా పిల్లా పీచూ అంటూ లేదు. అప్పుడే ఈ అరిష్టం ఏమిటి, స్వామీ? ఆ వెనక ఏడుస్తూ వచ్చే ముసలావిడ, మా అమ్మేనా, స్వామీ?" అని అడిగింది.

"ఆ వెనక వచ్చేది మీ అమ్మ కాదు, అత్త గారు. ఈ ప్రపంచంలో నిన్ను మనసారా ప్రేమించేది ఆమె మాత్రమే! తన ఒక్కగా నొక్క కొడుకును, తనతదనంతరం ప్రేమగా కనిపెట్టుకుని వుండి, తమ వంశాన్ని నిలబెట్టే నువ్వంటే ఆమెకు అమితమైన ప్రేమ. నిన్ను మంచం మీది నుంచి, కింద నేలమీద పడుకోబెట్టే రోజున, గుండెలు పగిలేలా దుఃఖించేది ఆమే! అటువంటి ఉత్తమురాలిని పొరుగింటి కుక్కకన్నా హీనంగా చూస్తూ,

"కలల పరమార్థం చెప్పగల మహాత్ములు మీరేనా, స్వామీ?" అని అడిగింది.

"కలల మర్మం అడిగితే చెప్పగలను కానీ, నేను మహాత్ముణ్ణి మాత్రం కాదు!" అని బైరాగి ఇసుకలో రాశాడు.

చామంతి అది చదివి, తనకు వచ్చిన పీడకల గురించి వివరంగా చెప్పి, "ఈ దిక్కు మాలిన కలకు అర్థమేమిటో సెలవివ్వండి, స్వామీ!" అన్నది.

బైరాగి కాసేపు కళ్ళు మూసుకుని తెరిచి, "నువ్వు కలలో చూసిన దాని పేరు సమయా నికి గుర్తురావడం లేదు. అది పాపులను నరకానికి చేరవేసే సాధనం. నువ్వక్కడికి త్వర లోనే ప్రయాణం కట్టబోతున్నావు!" అంటూ

రోజు రోజుకూ పాపం కూడగట్టుకుని, ఆ భారాన్ని తలమీద మోస్తూ నరకానికి చేరబోతు న్నావు!" అని బైరాగి ఇసుకలో రాశాడు.

అది చదువుతూనే చామంతి పశ్చాత్తాపంతో కళ్ళ నీళ్ళు పెట్టుకుని, "స్వామీ! నా పాపానికి ప్రాయశ్చిత్తం లేదా? ఈ గండం నుంచి గట్టెక్కే మార్గం తమరే చూపించాలి!" అన్నది.

బైరాగి కొంచెంసేపు కళ్ళు మూసుకుని తెరిచి, చేతిలోని పుల్లను ఒకసారి గాలిలో గిరగిరా తిప్పి, ఇసుకలో, "లేకేమి? ఉంది! ఉంది! ఈ క్షణం నుంచీ అత్తను ప్రాణ సమానంగా ఆదరించడం ఆరంభించు. అందుకు సంతోషించి, ఆమె నిన్ను తప్పక ఆశీర్వదిస్తుంది. దానితో నీ పీడకల దోషం హరించుకుపోయి, నీ ఆయుష్షు పెరగడమే కాక, పుత్ర పౌత్రాభివృద్ధితో సౌఖ్యవంతమైన జీవితం గడపగలవు," అని రాశాడు.

తర్వాత బైరాగి, ఇక వెళ్ళమన్నట్టుగా సైగ చేసి కళ్ళు మూసుకున్నాడు.

ఇంటికి తిరిగి వస్తూనే చామంతి, అత్త మంగమ్మ పాదాలకు నమస్కరించి, "అహం భావంతో, మిమ్మల్ని ఇన్నాళ్ళూ కష్టపెట్టాను. నన్ను క్షమించండి, అత్తయ్యా!" అన్నది.

ఆ మర్నాడు చలమయ్య పెరట్లోని బావి దగ్గర స్నానం చేస్తూండగా, కూర పాదులకు నీళ్ళు పోయడానికి వచ్చిన మంగమ్మ, కొడుకుతో, "ఒరే, నాయనా! ఏమిటిదంతా? ఏదో ఇంద్రజాలంలా వున్నది. కోడలు ఇంతగా మారిపోయిందేం?" అన్నది.

దానికి చలమయ్య నవ్వుతూ, "ఇదంతా చామంతికి వచ్చిన పీడకల పుణ్యం, చింత తోపులోని మూగ బైరాగి మహత్యం!" అన్నాడు.

"అలాగా! అయితే, నేనూ వెళ్ళి ఆ బైరాగి మహాత్ముణ్ణి దర్శనం చేసుకుంటాను," అన్నది మంగమ్మ.

తల్లి మాటలు వింటూనే చలమయ్య గతుక్కుమని, "అమ్మా, అదేం సాధ్యపడదు! ఈ ఉదయమే ఆయన మిగిలిపోయిన తపస్సు పూర్తి చేసుకునేందుకు, అటు ఉత్తర దిక్కుకేసి బయలుదేరి వెళ్ళాడు," అన్నాడు.

ఆ బైరాగి వేషం వేసింది తనేనని చలమయ్య, తల్లికి ఏనాడూ చెప్పలేదు.





# తేలుకుట్టిన దొంగ

పూర్వం ఒక గ్రామంలో ఇద్దరు స్నేహితులు ఉండేవారు. వారిలో ధర్మయ్య స్నేహపాత్రుడు, రామయ్య కొంచెం పిసినారి. ధర్మయ్యకు సంతానం లేదు. అందుకని అతను తీర్థ యాత్రలు చేద్దామనుకున్నాడు. అతని వద్ద రెండు వందల వరహాలు నగదున్నది. ఆ నగదులో ఒక వంద దారిఖర్చులకు ఉంచుకుని, మిగిలిన వందా ఎక్కడన్నా భద్రంగా దాద్దా మనుకున్నాడు. దాన్నిఎక్కడ దాయాలో తోచక, తన స్నేహితుడైన రామయ్యను సలహా అడిగాడు.

"నాదగ్గర నీ సొమ్ము ఉంచగలను గాని, ఖర్చయిపోతుందని భయం. అందుచేత, ఊరి బయట ఉన్న మర్రిచెట్టు కింద సొమ్ము పాతిపెట్టావంటే నువ్వు తిరిగివచ్చి తీసుకోవచ్చు," అన్నాడు రామయ్య.

ధర్మయ్యకు ఈ సలహా నచ్చింది. అయితే పట్టపగలు సొమ్ము తీసుకుపోయి మర్రిచెట్టు కింద పాతిపెడితే ఎవరైనా చూసి, తవ్వి తీసుకోవచ్చు. అందుచేత రాత్రి మాటుమణిగినాక ఆ పని చేద్దామనుకున్నాడు ధర్మయ్య. కాని చీకట్లో పడి ఒంటరిగా వెళ్ళటానికి భయంవేసి, రామయ్యను తోడు తీసుకుని వెళ్ళి, వంద వరహాలూ మర్రిచెట్టు కింద పాతిపెట్టి, తెల్లవారుఝామునే ధర్మయ్య తన భార్యతో సహా కాశీకి బయలుదేరి వెళ్ళిపోయాడు.

ఆ రాత్రి రామయ్య చాలా పొద్దుపోయి ఇంటికి రావటం చూసి, అతని భార్య బంగారమ్మ కారణం అడిగింది. రామయ్య, ధనం దాచిన సంగతి భార్యకు చెప్పేశాడు. ఆ మాట వినగానే బంగారమ్మకు దుర్బుద్ధి పుట్టుకొచ్చి, ఆ సొమ్ము తీసుకురమ్మన్నది. రామయ్య మొదట ఒప్పుకోలేదు. కాని, బంగారమ్మ బావిలో పడిచస్తానని బెదిరించినాక, రామయ్య పెళ్ళాం చెప్పిన ప్రకారమే వెళ్ళి, మర్రిచెట్టు కింద దాచిన ధనం తవ్వి తీసుకొచ్చాడు.

దాంతో బంగారమ్మ నగానట్రా చేయించుకుని, పట్టరాని ఆనందంతో వంటినిండా తగిలించుకున్నది.

కొంత కాలానికి ధర్మయ్య కాశీయాత్ర ముగించి స్వగ్రామానికి తిరిగివచ్చి, అప్పటికప్పుడే మర్రిచెట్టు వద్దకు వెళ్ళి, ధనం దాచినచోట తవ్వి చూశాడు. సొమ్ము లేదు. విషయం గ్రహించి ధర్మయ్య తిన్నగా గ్రామపెద్ద వద్దకు వెళ్ళి తనకు జరిగిన అన్యాయం గురించి చెప్పుకున్నాడు.

గ్రామపెద్ద ధర్మయ్య చెప్పినదంతా విని, "లాభం లేదు, ధర్మయ్యా, నువ్వు అడిగినంత మాత్రాన రామయ్య నీ డబ్బు తిరిగి ఇవ్వడు. అసలు నువ్వు మర్రిచెట్టు కింద డబ్బు పాతినట్టు సాక్ష్యమే లేదు. అందుచేత ఒక పని చెయ్యి," అని ధర్మయ్యకు ఒక ఉపాయం చెప్పాడు.

గ్రామ పెద్ద ఇంటి నుంచి ధర్మయ్య, రామయ్య ఇంటికి వెళ్ళాడు. ధర్మయ్యను చూడగానే రామయ్య గుండె గుభేలుమన్నది. అయితే ధర్మయ్య వాలకం చూస్తే, అతనికి తన సొమ్ము పోయిన సంగతి ఇంకా తెలిసినట్టు కనబడలేదు. ధర్మయ్య ఇంకా మర్రిచెట్టు దగ్గరికి వెళ్ళినట్టు లేదు, అనుకుని కాస్త ధైర్యం తెచ్చుకుని, "ఏం ధర్మయ్యా ఇదేనా రావటం? యాత్ర సుఖంగా జరిగిందా?" అని రామయ్య కుశల ప్రశ్నలు వేశాడు.



"ఆ, నీ దయవల్ల ప్రయాణం దివ్యంగా జరిగింది. అయితే, చూడూ, మనం మరోసారి మర్రిచెట్టు దగ్గరికి వెళ్ళి రావాలి. ఎందుకంటే, నేను బయలుదేరిన వేళావిశేషం ఏమిటోగాని, ఈ యాత్రలో వెయ్యి వరహాలు సంపాదించుకున్నాను. ఈ వెయ్యివరహాలూ పాత మొత్తంతో కలిపి పాతిపెట్టి, అట్లా రామేశ్వర యాత్ర కూడా చేసుకొద్దామని నిశ్చయించాను. రేపు రాత్రికి నేను మీ ఇంటికి వస్తాను. మనమిద్దరమూ కలిసి మర్రిచెట్టు దగ్గరికి పోదాం. సరేనా?" అన్నాడు ధర్మయ్య.

ఇద్దరూ కలిసి మర్రిచెట్టు దగ్గరికి పోవాలనే సరికి రామయ్య భయపడిపోయాడు. సరేనని తల ఆడించి ధర్మయ్యను పంపేసి,

రామయ్య తన భార్యతో, "కొంప మునిగిందే!" అంటూ ధర్మయ్య అన్న మాటలు చెప్పి, "రేపు రాత్రి నేను ఏ మొహం పెట్టుకుని ధర్మయ్య వెంట ఆ మర్రిచెట్టు దగ్గరకు వెళ్ళను? నా దొంగతనం బయటపడిపోదూ?" అన్నాడు.

"ఈ భాగ్యానికే భయపడతారేమండీ? నా నగలన్నీ తాకట్టుపెట్టి ఓ నూరు వరహాలు పట్టుకొచ్చి మర్రిచెట్టు కింద పాతి పెట్టండి. అవి చూసుకుని ధర్మయ్య ధైర్యంగా తన వెయ్యి వరహాలు కూడా పాతిపెడతాడు. ఆయన అట్లా రామేశ్వరానికి ప్రయాణమై పోగానే మనం మొత్తమంతా తవ్వి తెచ్చు కుందాం," అన్నది బంగారమ్మ.

రామయ్య తన భార్యకు గల సూక్ష్మబుద్ధిని మెచ్చుకుని, ఆమె నగలన్నీ తీసుకుపోయి తాకట్టుపెట్టి నూరు వరహాలు తెచ్చి, వాటిని తీసుకుపోయి, ఆ రాత్రి మర్రిచెట్టుకింద పాత చోట పాతిపెట్టి ఇంటికి తిరిగి వచ్చాడు.

మర్నాడు రాత్రి రామయ్య ధర్మయ్య కోసం చాలాసేపు ఎదురుచూశాడు. కాని ధర్మయ్య జాడ లేదు. అర్ధరాత్రి అయింది. రామయ్య ధర్మయ్య ఇంటికి వెళ్ళి తలుపు తట్టేసరికి, మంచినిద్రలో వున్న ధర్మయ్య కళ్ళు నులుపు కుంటూ లేచివచ్చి, "ఏం, రామయ్యా? అర్ధ రాత్రి వేళ వచ్చావు?" అని అడిగాడు.

"ఈ రాత్రికి మర్రిచెట్టు కిందికి పోదా మంటివిగా?" అన్నాడు రామయ్య.

"ఓ అదా? నీకు తెల్లవారి చెబుదామను కుంటున్నాను, రామయ్యా. నేను ప్రస్తుతానికి రామేశ్వరం ప్రయాణం మానుకున్నాను. అందు చేత సాయంకాలం అలా వెళ్ళి, మనం పాతే సిన డబ్బు కాస్తా తెచ్చేసుకున్నాను," అన్నాడు ధర్మయ్య.

చేసేదిలేక రామయ్య ఇంటికి తిరిగి వచ్చి, జరిగినదంతా భార్యకు చెప్పాడు.

"అయ్యో, ఎంత మోసం! రెండు వందల వరహాల నగలు తాకట్టులో ఇరకబెట్టితిమే, వాటిని ఎట్లా విడిపించుకోవటం?" అని బంగా రమ్మ ఏడిచింది. ఆమెతోబాటు రామయ్యా ఏడిచాడు. కాని ఏం చేస్తారు? తేలు కుట్టిన దొంగలు! కిక్కురుమనటానికి లేదు.






అగ్నిహోత్రుడు తనపాట్లు చెప్పగా విని బ్రహ్మ ఒక్క క్షణం ఆలోచించి, "నర నారాయణులు కృష్ణార్జునులుగా భూమి మీద అవతరించి ఉన్నారు. వారు ఖాండవ వన ప్రాంతానికి వస్తారు. ఆ సమయం కనిపెట్టి వారి సహాయం కోరు. వారు నీకు సహాయపడినట్టయితే, ఇంద్రుడు కాదు గదా, దేవతలందరూ అడ్డు పడినా, నీ పని నిరాటంకంగా సాగుతుంది," అని చెప్పాడు.

అందుచేత అగ్ని ఈనాడు కృష్ణార్జునుల సహాయం కోరవచ్చాడు.

అగ్నిహోత్రుడు తన సహాయం కోరటం విని అర్జునుడు, "అగ్నిహోత్రుడా, ఇంద్రాది దేవతలతో యుద్ధం చెయ్యటానికి తగిన అస్త్రాలన్నీ నాకు తెలుసు. అయితే, నాకిప్పుడు మంచి ధనుస్సూ, మంచి గుర్రాలను పూన్చిన దృఢమైన రథమూ లేవు. నాకూ, కృష్ణుడికీ తగిన ఆయుధాలూ, మమ్మల్నిద్దరినీ మోయ గల రథమూ సంపాదించావంటే నీ కోరిక తీరుస్తాను," అన్నాడు.

అగ్నిహోత్రుడు వరుణుణ్ణి తలుచుకున్నాడు. వరుణుడు ప్రత్యక్షమయ్యాడు. అగ్ని వరుణుడితో, "మహానుభావా, చంద్రుడు నీకిచ్చిన గాండీవ మనే ధనుస్సూ, అక్షయతూణీరాలూ, కపిధ్వజం గల రథమూ, చక్రాయుధమూ నీ వద్ద ఉన్నాయిగదా, వాటితో నాకిప్పుడు అవసరం కలిగింది, బదులియ్యి," అన్నాడు.

వరుణుడు అగ్నిహోత్రుడికి అతను కోరినవియిచ్చి, అంతర్ధానమయ్యాడు. అగ్నిహోత్రుడు కృష్ణార్జునులకు వాటిని ఇచ్చాడు. చక్రాన్ని కృష్ణుడు తీసుకున్నాడు. గాండీవాన్నీ, అక్షయతూణీరాలనూ అర్జునుడు తీసుకున్నాడు. గాండీవం సామాన్యమైన విల్లు కాదు. అది లక్ష ఆయుధాలకు సమానం. ఆ రథాన్నీ, అక్షయతూణీరాలనూ పూర్వం

20. ఖాండవవన దహనం



విశ్వకర్మ నిర్మించాడు. వాటిని చంద్రుడు దేవాసుర యుద్ధాలలో ఉపయోగించాడు.

కృష్ణుడు తీసుకున్న చక్రాయుధం శత్రువులను చంపి తిరిగి వచ్చే శక్తిగలది. వరుణుడు అంతర్ధానమయ్యే ముందు కృష్ణుడికి కౌమోదకి అనే గదను కూడా ఇచ్చాడు.

ఆయుధాలు స్వీకరించి కృష్ణార్జునులు, "ఓ అగ్నిదేవుడా, ఇక నువ్వు ఖాండవ వనాన్ని దహించటం ప్రారంభించు. ఇంద్రుడు వచ్చినా మమ్మల్ని ఏమీ చేయలేడు," అన్నారు.

అగ్నిహోత్రుడికి ఎక్కడలేని ఉత్సాహమూ వచ్చింది. అతను ఖాండవవనం ప్రవేశించి, అందులోని మహావృక్షాలనూ, లతలనూ, ఓషధులనూ, వనస్పతులనూ దహించసాగాడు. కార్చిచ్చు వేడికి తట్టుకోలేక వనంలోని వివిధ ప్రాణులు బయటికి పారిపోతూ ఉంటే, కృష్ణార్జునులు వాటిని పోనివ్వక, అగ్నికి ఆహుతి అయ్యేటట్టు చేశారు. ఆకాశంలోకి ఎగిరిపోవటానికి ప్రయత్నించిన రకరకాల పక్షులు, వేడికి మాడి తిరిగి మంటలలోనే పడిపోయాయి.

ఖాండవవనం అతి దారుణంగా తగలబడుతూ, అకాల ప్రళయం అనిపించింది. దాని వేడికి భయపడి దేవతలు ఇంద్రుడి దగ్గరికి వెళ్ళి, లోకాలన్నీ బూడిద అయిపోతున్నాయని చెప్పారు. ఖాండవవనం మీద భారీగా వర్షం కురిపించమని ఇంద్రుడు పర్జన్యుణ్ణి ఆజ్ఞాపించాడు.

ఎంత పెద్ద ఎత్తున వర్షం కురిసినా, కురిసిన నీరు కురిసినట్టే ఆవిరి అయిపోయి, అగ్నిని చల్లార్చలేకపోయింది. అది చూసి ఇంద్రుడికి చాలా కోపం వచ్చింది. ఖాండవ వనం మీద ఒక్కసారిగా వర్షం కురవమని అతను మేఘాలన్నిటినీ ఆజ్ఞాపించాడు.

అర్జునుడు ఖాండవవనం మీదనేగాక, దాన్ని దాటి అన్ని పక్కలా చాలామేర వాన చినుకు అన్నది పడటానికి వీలు లేకుండా బాణాలతో పందిరి నిర్మించాడు. ఖాండవ వనం తగలబడి పోవటానికి ఏ అంతరాయమూ లేకపోయింది.

కృష్ణార్జునుల సహాయంతో ఈసారి అగ్నిహోత్రుడు వనాన్ని పూర్తిగా దగ్ధం చేస్తాడని

రూఢి కాగానే, ఆ వనానికి ఎంతో కాలంగా రక్షకుడుగా ఉంటూ ఉండిన తక్షకుడు చల్లగా వనాన్ని వదిలిపెట్టి కురుక్షేత్రానికి చేరుకున్నాడు.

తక్షకుడి కొడుకు అశ్వసేనుడు అనేవాడు తన తల్లి చాటున వనం విడిచి పోతూండగా అర్జునుడు గమనించి, అశ్వసేనుడి తల్లి తలనూ, అశ్వసేనుడి తోకనూ బాణాలతో నరికాడు. తోక తెగినా, ప్రాణాలతో అశ్వసేనుడు తప్పించుకున్నాడు.

తరవాత ఇంద్రుడికీ, అర్జునుడికీ ఘోరమైన యుద్ధం జరిగింది. కాని ఇంద్రుడు అర్జునుణ్ణి జయించలేకపోయాడు. ఖాండవ వనాన్ని ఆశ్రయించుకుని ఉన్న రాక్షసులు కొందరు యుద్ధానికి రాగా, కృష్ణుడు వారిని తన చక్రంతో చంపేశాడు. మయుడనే రాక్షసుడు తప్పించుకు పారిపోతుంటే కృష్ణుడు వాణ్ణి చంపబోతే, మయుడు అర్జునుణ్ణి శరణు జొచ్చాడు.

ఖాండవవనాన్ని అగ్నిహోత్రుడు పదిహేను రోజుల పాటు దహించాడు. ఆ వనంలో ఉన్న ప్రాణికోటి కూడా వనంతోపాటు కాలిపోయింది. అందులో చావకుండా బతికినవారు ఎవరంటే – తక్షకుడూ, అతని కొడుకు అశ్వసేనుడూ, మయుడూ, శార్ఙ్గకులు నలుగురూనూ.

ఈ శార్ఙ్గకులు మందపాలుడనే ముని సంతానం. మందపాలుడు బ్రహ్మచర్య వ్రతం



అవలంబించి చాలాకాలం తపస్సు చేసి, తన యోగశక్తితో స్వర్గానికి వెళ్ళాడు. కాని అతనికి స్వర్గంలో సుఖం కలగలేదు. అన్ని సుఖాలూ ఇవ్వదగిన స్వర్గం తనకు సుఖంగా ఎందుకు లేదని మందపాలుడు అక్కడి దేవతలను అడిగాడు.

దానికి దేవతలు, “నువ్వు తపస్సు చేసి దేవఋణం తీర్చావుగాని, సంతానం పొంది పితరుల ఋణం తీర్చలేదు. అందుకే ఈ స్వర్గంలో నీకు సుఖం లేకుండా ఉన్నది,” అని జవాబు చెప్పారు.

అప్పుడు మందపాలుడు పక్షులకు త్వరగా సంతాన ప్రాప్తి కలుగుతుంది గదా అని, శార్ఙ్గపక్షి రూపం ధరించి, జరిత అనే

పెంటి పక్షికి నలుగురు పిల్లలను కన్నాడు. తరవాత అతను తన ఆశ్రమానికి తిరిగి పోయి, లపిత అనే భార్యతో మామూలుగా సంసారం చెయ్యసాగాడు.

అలా ఉండగా ఒకనాడు మందపాలుడికి, ఖాండవవనాన్ని దహించటానికి పోతున్న అగ్ని కనిపించాడు. ఆయన తన శక్తితో అగ్ని ఉద్దేశం గ్రహించి, "అగ్నిహోత్రుడా, ఖాండవవనంలో నా బిడ్డలున్నారు. వారిని మాత్రం చావనీకు," అన్నాడు. దానికి అగ్ని అంగీకరించాడు. ఆ కారణంగా శార్ఙ్గకులు నలుగురూ ప్రాణాలతో బయటపడ్డారు.

ఏమైతేనేం, ఖాండవవనం పూర్తిగా తగలబడిపోయింది, అగ్నిదేవుడి అజీర్తి బాధ నివారణ అయింది. ఆయన, తనకు సహాయపడిన కృష్ణార్జునులను దీవించి తన దారిన తాను వెళ్ళిపోయాడు.

ఇంద్రుడుకూడా కృష్ణార్జునుల శక్తి సామర్థ్యాలకు మెచ్చి,దేవతలతో సహా వారి ముందు ప్రత్యక్షమయ్యాడు. వారు ఇంద్రుడికి నమస్కారంచేశారు.ఇంద్రుడువరంకోరుకోమంటే, అర్జునుడు దివ్యాస్త్రాలు ఇవ్వమని కోరాడు.

"నీకు మహేశ్వరుడు ప్రత్యక్షమవుతాడు. అప్పుడు నేను నీకు దివ్యాస్త్రాలిస్తాను," అని ఇంద్రుడు అర్జునుడికి చెప్పి, కృష్ణార్జునుల స్నేహం శాశ్వతంగా ఉండేటట్టు దీవించి, దేవతలతో సహా స్వర్గానికితిరిగి వెళ్ళిపోయాడు. తరవాత కృష్ణార్జునులు యమునా తీరాన



తమ విహారస్థలానికి తిరిగి వచ్చారు. వారి వెంట మయుడు కూడా వచ్చాడు. మయుడు అర్జునుడికి నమస్కారం చేసి, "మహాత్మా, మీ దయచేతనే నేను ఖాండవవనం నుంచి ప్రాణాలతో బయటపడ్డాను. ఈ కృష్ణుడుగాని, అగ్నిహోత్రుడు గాని నన్ను దహించటానికి వెనకాడి ఉండరు. నేను మీకు ఏ విధంగా ప్రత్యుపకారం చెయ్యను? నేను రాక్షసుల విశ్వకర్మను. అందుచేత మీరేది కోరితే అది నిర్మించి పోదామనుకుంటున్నాను. అందుచేత మీ కోరిక ఏమిటో తెలపండి," అన్నాడు.

అర్జునుడు ఏమీ కోరక, "నీ స్నేహభావం మాకుచాలు,"అన్నాడు.కానిమయుడు ఏదన్నా నిర్మించి ఇస్తానని పట్టుబట్టాడు. అందుచేత



తరవాత మయుడు ఒక శుభదినాన మంగళస్నానం చేసి, బ్రాహ్మణులకు సంతర్పణ చేసి, ఎటు చూసినా పదివేల జానలుండే నలుచదరపు స్థలంలో సభాభవనం నిర్మించటానికి ఉపక్రమించాడు.

ఈ సమయంలోనే కృష్ణుడు ద్వారకకు తిరుగు ప్రయాణమైనాడు. అర్జునుడు ఎక్కి వచ్చిన రథం మీదనే అతను తిరిగి వెళ్ళాడు. పాండవులు అతన్ని చాలా దూరం సాగనంపారు.

కొద్ది కాలానికి మయుడు సభా నిర్మాణం పూర్తి చేశాడు. అతను ఒకప్పుడు వృషపర్వుడనే రాక్షసరాజుకు సభను నిర్మింతామనే ఉద్దేశంతో బిందుసరోవరం తీరాన వివిధ మణిమయ పదార్థాలు దాచి ఉంచాడు. అక్కడనే వృషపర్వుడు తన సాటిలేని గదను కూడా దాచి వుంచాడు. వరుణుడి శంఖం దేవదత్తం కూడా అక్కడ ఉంచిన సామగ్రిలో ఉన్నది. మయుడు ఆ గదను భీముడికీ, శంఖాన్ని అర్జునుడికీ తెచ్చి ఇచ్చాడు.

ఇక సభను మయుడు తయారుచేసిన పద్ధతి అత్యద్భుతమైనది. అందులో మయుడు కొన్ని సరోవరాలు కట్టాడు. వాటి గోడలకు రత్నాలూ, ఆకులకు వైడూర్యాలూ, మెట్లకు స్ఫటికాలూ అమర్చాడు. బంగారంతో చేసిన కమలాలూ, తాబేళ్ళూ, చేపలూ ఏర్పాటు చేశాడు. నీటిభాగానికీ, నేలభాగానికీ తేడా కనపడకుండా చేశాడు. సభఅంతటా దూలా

అర్జునుడు కృష్ణుడి సలహా అడిగాడు. కృష్ణుడు కొంచెం ఆలోచించి మయుడితో, "ధర్మరాజుకు ఒక ప్రశస్తమైన సభ నిర్మించి ఇయ్యి. అది చాలా అందంగా ఉండాలి. దివ్య ప్రభావం గలదిగా ఉండాలి," అన్నాడు.

అందుకు మయుడు సమ్మతించాడు. కృష్ణార్జునులు మయుడితో సహా ఇంద్రప్రస్థానికి తిరిగి వచ్చి, ధర్మరాజుకు ఖాండవవన దహనం గురించి అంతా చెప్పారు. మయుణ్ణి అర్జునుడు ఏవిధంగా అగ్ని నుంచి కాపాడినదీ, అందుకు ప్రత్యుపకారంగా మయుడు ఎలా సభను నిర్మిస్తానన్నదీ కూడా ధర్మరాజు తెలుసుకుని, సంతోషించి, మయుడికి తగిన సత్కారం చేశాడు.

లకూ, స్తంభాలకూ, గోడలకూ, అరుగులకూ మణులు అమర్చాడు. ఆ సభలో అనేక రకాల ఆకర్షణలున్నాయి. చూసేవారికి అనేక రకాల భ్రమలు కలుగుతాయి.

లోకోత్తరమైన ఈ సభను తయారుచేసి ఇచ్చిన మయుడికి ధర్మరాజు తగిన సన్మానం చేసి పంపేశాడు. తరవాత ఆయన పదివేల మంది బ్రాహ్మణులకు సంతర్పణా, సమారాధనా చేసి, దానాలిచ్చి, వారి ఆశీర్వాదాలు పొంది, తన తమ్ములతో సహా మయసభ ప్రవేశించాడు.

అనేక దేశాల రాజులు ధర్మరాజు గొప్పతనాన్ని అమోదించి, అతనికి గుర్రాలూ, బంగారు ఆభరణాలూ, మణులూ, అందగత్తెలైన స్త్రీలూ, దాసదాసీలూ మొదలైన కానుకలు తెచ్చి సమర్పించారు. ఇలా కానుకలు తెచ్చినవారిలో అంగ, వంగ, కళింగ, ఆంధ్ర, పుండ్రక, కిరాత, మగధ, మత్స్య, మాళవ, కేకయ, కరూశ, కాంభోజ, మద్ర, పాండ్య మొదలైన దేశాల రాజులున్నారు. అలాగే అనేకమంది ప్రసిద్ధులైన ఋషులు ధర్మరాజు సభకు వచ్చి, అనేక కథలు చెప్పారు. ఆ సమయంలో నారదుడు పారిజాతుడు, రైవతుడు మొదలైన తన శిష్యులతో ధర్మరాజు సభకు వచ్చాడు. ధర్మరాజు భక్తితో నారదుడికి అర్ఘ్యపాద్యాలూ, ఆసనమూ, మధుపర్కాలూ ఇచ్చి సత్కరించాడు.

నారదముని ధర్మరాజుతో రాజు చేయవలసిన అనేక పనులను గురించి మాట్లాడి, దిక్పాలకుల సభలను వర్ణించి చెప్పి, రాజసూయయాగం చేసినవారికి స్వర్గం లభిస్తుందనీ, హరిశ్చంద్రుడి వంటి రాజులు ఆ యాగం చెయ్యటం చేతనే ఇంద్రలోకంలో ఉన్నారనీ చెప్పి,ఒక హెచ్చరిక కూడా చేశాడు. అదేమిటంటే — రాజసూయం నిర్విఘ్నంగా చేసినట్టయితే అపారమైన జననష్టం కలిగించే యుద్ధం వస్తుంది.

ఈహెచ్చరిక చేసి నారదుడు ధర్మరాజుతో, "రాజా, బాగా ఆలోచించి నీకు ఏది మేలని తోస్తే అది చెయ్యి." అని, ధర్మరాజు వద్ద సెలవు పుచ్చుకుని ద్వారకకు బయలుదేరి వెళ్ళిపోయాడు.



# చందమామ కబుర్లు

## ఒక సెకండు ఆలస్యం!

నూతన సంవత్సరం ఒక సెకండు ఆలస్యంగా వచ్చింది. 1996వ సం॥ లీపు సంవత్సరం కాబట్టి ఫిబ్రవరి నెలలో ఒకరోజు ఎక్కువయినట్లే 'అటామిక్ క్లాక్స్'లో డిసెంబర్ 31వ తేదీకి ఒక సెకండు ఎక్కువ చేశారు శాస్త్రవేత్తలు. ఆ విధంగా ఈ కొత్త సంవత్సరం ఒక సెకండు ఆలస్యంగా వచ్చిందన్న మాట! భూభ్రమణానికి తగిన విధంగా అటామిక్ గడియారాలను సరిదిద్దుతూ ఉంటారు, వాటికి బాధ్యత వహించే శాస్త్రవేత్తలు. భూమిలో మూడు వంతులు నీళ్ళే కాబట్టి - సముద్రాల ఒత్తిళ్ళను బట్టి భూభ్రమణంలో కొద్దిగా తేడా ఉంటుంది. ఆ తేడాను బట్టి శాస్త్రవేత్తలు 'అటామిక్ క్లాక్స్'ను సరి దిద్దుతూ ఉంటారు.

## చేపకు గాజు కన్ను!

నీళ్ళు అనగానే మనకు చేపలు గుర్తుకు వస్తాయి. అమెరికాలోని నార్త్ కరోలినాలో ఒక అక్వారియంలో ఉన్న చేప కంటికి శస్త్ర చికిత్స చేశారు. ఆ చేపకు ఒక కంటికి బదులు బంగారు రంగు గాజు కన్ను అమ ర్చారు. శస్త్ర చికిత్స నీళ్ళకు బయట జరిగింది. గత నవంబర్‌లో నార్త్ కరోలినా వెటరినరీ కాలేజీలో శస్త్ర చికిత్స చేసిన డాక్టర్ అందుకు అతి చిన్న పరికరాలనూ, భూతద్దాలను ఉపయోగించాడు. ఆ సమయంలో చేపకు మత్తు కూడా ఇచ్చారు!

## పాండా క్లబ్

జవహర్‌లాల్ నెహ్రూ పాండా పిల్లతో ఆడుకుంటూ న్నట్టున్న ఫోటో ప్రసిద్ధమైనది. ఆ పాండాను ఢిల్లీలో ఆయన నివాస గృహమైన తీన్‌మూర్తి భవన్‌లోపెం చారు. పెద్ద పెద్ద కళ్ళ చుట్టూ నల్లటి చారలతో, ఒళ్ళంతానలుపు తెలుపు రోమాలతో నిండిన పాండా చైనా - టిబెట్ ప్రాంతాలకు చెందినది. నెహ్రూ జన్మదినమైన గత నవంబర్ 14వ తేదీ 'పాండా క్లబ్ ఆఫ్ ఇండియా' అనే ఒక అంతర్జాతీయ సంస్థను స్థాపించారు. ఇందులో ఆరు నుంచి పదహారేళ్ళ వయసు గల పిల్లలు మాత్రమే సభ్యులుగా ఉంటారు. ఈ క్లబ్ మద్రాసు శాఖలో దాదాపు 100 మంది సభ్యులు ఉన్నారు. నవంబర్ 14వ తేదీ ప్రారంభోత్స వానికి సమావేశమైన పిల్లలందరూ 'జయింట్ పాండా'తో కరచాలనం చేశారు. ఈ సంస్థ స్థాపకుడైన ప్రముఖ టెన్నిస్ క్రీడాకారుడు విజయ్ అమృతరాజ్ సభ్యులకు శుభాకాంక్షలు తెలియజేసి, సంస్థ భవిష్యత్తు కార్యక్రమాలను వివరించాడు. మీరు కూడా ఈ సంస్థలో చేరాలనుకున్నట్టయితే, ఈ చిరునామాకు రాయండి: పాండా క్లబ్ ఆఫ్ ఇండియా, 2, కృష్ణమా రోడ్, నుంగంబాకం, మద్రాసు - 600 034.



| చందమామ అనుబంధం-87 | మనదేశపు చెట్లు |
| --- | --- |

# మద్ది చెట్లు

పాండవ మధ్యముడైన అర్జునుడు తన తండ్రి ఇంద్రుడి లాగే తెల్లగా ఉండేవాడు. అందుకే అతనికా పేరు వచ్చిందని చెబుతారు. మద్ది చెట్టు కలప తెల్లగా ఉండడం వల్ల దానిని కొన్ని ప్రాంతాలలో అర్జున వృక్షం అని కూడా పిలుస్తారు. తమిళంలో దీనిని వెళ్ళమరుదు అనీ, కన్నడంలో అరాజినా అనీ, మలయాళంలో స్వర్ణాక్కం అనీ, అస్సామీలో సోనారూ అనీ, బెంగాలీలో సాండాల్ బండార్లేట్ అనీ అంటారు.

అస్సాం, బెంగాల్, కేరళ, దక్షిణ కర్ణాటక ప్రాంతాలలో ఈ చెట్లు విరివిగా కనిపిస్తాయి. ఇవి ముఖ్యంగా నదీ తీరాలలో, నేల తడిగా ఉన్న ప్రాంతాలలో బాగా పెరుగుతాయి. కొన్ని సంస్కృత గ్రంథాలు ఈ చెట్లను నదీ సర్జలని పేర్కొంటాయి.

లాటిన్ భాషలో వీటిని 'టెర్మినాలియా అర్జునా' అని అంటారు. వీటి పువ్వులు లేత పసుపు రంగులో ఉంటాయి; కొమ్మలచివర పూస్తాయి.

ఈ చెట్లు మార్చి-జూన్ నెలలలో పూతకు వస్తాయి. కాంతివంతమైన పచ్చ ఆకులు ఒకదానికొకటి ఎదురెదురుగా ఉంటాయి. శీతాకాలంలో ఆకులు రాలడానికి ముందు ముదురు రాగి రంగుకు మారతాయి. అప్పుడు ఈ చెట్లు చూడడానికి ఎంతో ఆకర్షణీయంగా ఉంటాయి. ఆకులు రాలుస్తాయి కాని, ఈ మద్ది చెట్లు ఎప్పుడు కాని మోడుగా కనిపించవు.

దీని కలప తేలికగా ఉన్నా, చాలా దృఢమైనది. ఇంటి తలుపులకు, కిటికీలకు, వ్యవసాయపు పనిముట్లు తయారుచేయడానికి దీనిని ఉపయోగిస్తారు.



మనదేశపు ఋషులు-10

# జనకుడు

ఒక రాజ్యానికి రాజుగా ఉండి, తపోమహిమను గుర్తించి -- రాజ్యసింహాసనాన్ని త్యజించి, తపస్సు చేసి రాజర్షి అయినవాడు విశ్వామిత్రుడు. ఆయన అరిషడ్వర్గాలను జయించి ఉత్తరోత్తరా బ్రహ్మర్షి అనిపించుకున్నాడు.

మిథిలాధిపతి అయిన జనకుడు రాజుగా ఉంటూ జ్ఞాన వైరాగ్యాలు కలిగి గృహస్థాశ్రమంలోనే ఆధ్యాత్మిక సాధన కొనసాగించాడు. ఆయన ఆధ్యాత్మిక సాధనకు రాజ్యాధికారం అంతరాయం కలిగించలేదు. రాజు అనే అహంకారం ఆయనలో లేకపోవడమే అందుకు కారణం. పరిపాలనా బాధ్యతలను ఆయన దైవ సమర్పణా భావంతో, ఒక యజ్ఞంలాగా నిర్వర్తించాడు. అందుకే ఆయన కర్మయోగిగా, రాజర్షిగా కీర్తిగాంచాడు.

వాల్మీకి రామాయణంలో రాజర్షి జనకుడు ఒక ఉదాత్తమైన పాత్ర. ఆయన యజ్ఞం చేయ తలపెట్టి, భూమిని దున్నుతూండగా, నాగేటి చాలు నుంచి బంగారు పేటికలో దివ్యతేజస్సుతో ఒక ఆడ శిశువు దొరికింది. ఆ బిడ్డకు సీత అని నామకరణం చేసి, పెంచి పెద్దచేసి శివధనుస్సును విరిచిన శ్రీరాముడికిచ్చి వివాహం చేసిన కథ జగద్విదితం.

జనక మహారాజు తరచూ సభ చేసి, విజ్ఞులైన పండితులతో ధర్మవిచారం, వేదాంత శాస్త్రచర్చలు జరిపేవాడు. కుల గురువైన యాజ్ఞవల్క్య మునితో ఆయన జరిపిన సంభాషణ తాత్విక లోకంలో ప్రసిద్ధి గాంచింది. అందులోని కొన్ని ప్రశ్నోత్తరాలు ఇక్కడ చూద్దాం:

జనకుడు : "మహాత్మా! మనిషిని నడిపించే వెలుగు ఏది?"

యాజ్ఞవల్క్యుడు : "సూర్యుడు, మహారాజా!"

జనకుడు : "అలాగా! మరి, సూర్యుడు అస్తమించాక?"

యాజ్ఞవల్క్యుడు : "చంద్రుడు వెలుగునిస్తాడు."

జనకుడు : "సూర్యుడు, చంద్రుడూ లేనప్పుడు?"

యాజ్ఞవల్క్యుడు : "అగ్ని వెలుగు నిస్తుంది."

జనకుడు : "అగ్ని కూడా లేనప్పుడు?"

యాజ్ఞవల్క్యుడు : "అటువంటప్పుడు వాక్కు వెలుగు చూపుతుంది."

జనకుడు : "వాక్కు కూడా కరువైనప్పుడు ఏది వెలుగు చూపుతుంది?"

యాజ్ఞవల్క్యుడు : "అటువంటి సమయాలలో వెలుగు నిచ్చేది ఆత్మ!"



# మీకు తెలుసా?

1. గత 12 ఏళ్ళుగా అణ్వాయుధ రహిత ప్రాంతంగా ఉంటున్న దేశం ఏది?
2. భారత జాతీయ కాంగ్రెస్, శత జయంతి ఉత్సవాలను ఎప్పుడు జరుపుకున్నది?
3. గ్రహాలలోకెల్లా పరిమాణంలో పెద్దది ఏది?
4. ఢిల్లీలోని నాటి వైస్రాయ్ నివాసానికి (ఇప్పటి రాష్ట్రపతి భవన్) రూపకల్పన చేసినవారెవరు?
5. పురాణాలలోని ఇంద్రుడి రాజధాని ఏది?
6. రైలుపెట్టెలు తయారుచేసే 'ఇంటెగ్రల్ కోచ్ ఫ్యాక్టరీ' ఎక్కడ ఉన్నది?
7. యూరపులో ప్రవహించే అతి పెద్ద నది ఏది?
8. మొట్టమొదట తపాలా బిళ్ళలు వెలువరించిన దేశం ఏది?
9. గాంధీజీ స్థాపించిన మొట్టమొదటి ఆశ్రమం పేరేమిటి?
10. మానవ శరీరంలోని అతి పెద్ద అవయవం ఏది?
11. మన దేశంలో 'హరిత విప్లవాన్ని' సూచించే పంట ఏది?
12. శక సంవత్సరాన్ని ప్రవేశపెట్టిన రాజెవరు?
13. అధునిక 'ఇటలీ పిత'గా పేరుగాంచిన వారెవరు?
14. మన దేశంలో నేలబొగ్గు ఎక్కువగా ఉన్న రాష్ట్రం ఏది?
15. బుద్ధుడు ఎక్కడ 'నిర్వాణం' చెందాడు?
16. 'బ్లూ చిప్' అంటే ఏమిటి?
17. సినిమా థియేటర్లు లేని దేశం ఏది?
18. 'క్విట్ ఇండియా' ఉద్యమం ఎప్పుడు ఆరంభమయింది?

## సమాధానాలు

1. న్యూజీలాండ్.
2. 1985వ సం॥లో.
3. గురుగ్రహం.
4. సర్ ఎడ్విన్ లుటీన్స్.
5. అమరావతి.
6. మద్రాసులోని పెరంబూర్‌లో.
7. ఓల్గా నది.
8. గ్రేట్ బ్రిటన్.
9. దక్షిణ ఆఫ్రికా డర్బన్ సమీపంలోని 'ఫీనిక్స్ ఫార్మ్'.
10. కాలేయము.
11. గోధుమ.
12. కనిష్కుడు.
13. గ్యారీబాల్డీ.
14. బీహార్.
15. కుశీ నగరం.
16. సక్రమంగా అభివృద్ధి చెందుతూన్న సుస్థిరమైన సంస్థ 'షేర్'.
17. సౌదీ అరేబియా.
18. 1942 ఆగస్టు 8.




# రాక్షసుడి బేరం

సీతాపురమనే గ్రామంలో వీరయ్యఅనే పేదవాడున్నాడు. వాడికి భార్య, ముగ్గురు కొడుకులు, ఇద్దరు కూతుళ్ళున్నారు. పెద్దకొడుకు సోమయ్య తప్ప, మిగతా అందరూ కష్టపడి పనిచేసి ఎంతో కొంతడబ్బుసంపాయిస్తున్నారు. అయినా వాళ్ళకు పూట గడవడం కష్టంగా వుంటున్నది.

సోమయ్య పరమ సోమరి. వాడు ఏ పనీ చేయడు సరికదా, ముగ్గురు మనుషుల తిండి తింటాడు. మనిషి బాగా కొవ్వు పట్టి లావెక్కాడు. ఎక్కువగా నిద్రపోతూంటాడు. ఒంట్లో ఏమాత్రం నలత చేసినా పెద్ద గోల ప్రారంభిస్తాడు. వైద్యుణ్ణి పిలవడం తప్పనిసరి. ఇంట్లో వాళ్ళు సంపాదించేది చాలావరకూ వాడి తిండికీ, మందులకూ ఖర్చయేది.

ఒకరోజున చంద్రనాధుడనే పట్నవాసపు మనిషి సీతాపురం వచ్చాడు. ఆయనకు వీరయ్యతో దూరపు చుట్టరికం వున్నది. వీరయ్య పరిస్థితి చూసి ఆయన, "ఇక్కడ ఎన్నాళ్ళిలా రెక్కలు ముక్కలు చేసుకుంటావు? ఇదే పనికి పట్నంలో బోలెడు డబ్బు సంపాదించవచ్చు. సుఖంగా బ్రతకవచ్చు," అని చెప్పాడు.

ఈ మాటలు ఆసరా చేసుకుని, రెండు రోజుల తర్వాత వీరయ్య కుటుంబం పట్నానికి ప్రయాణమయింది. కొంతదూరం వెళ్ళాక అడవిదారి వచ్చింది. అడవిలో కొంత దూరం నడిచేసరికి చీకటి పడింది. వాళ్ళు ఒక పెద్ద చెట్టు కింద బస చేసి, తమవెంట తెచ్చుకున్న ఆహారం తిందామని మూటలు విప్పారు.

సోమయ్యకు నడక అలవాటు లేదు కదా-వాడు బాగాఅలిసిపోయాడు. ఆకలి దహించి వేస్తున్నది. వీరయ్య ఇలా మూటలు విప్పగానే వాడు ఆవురావురుమంటూ మొత్తం అందరి తిండీ తినేసి పడుకుని, గుర్రు పెట్టి నిద్రపోసాగాడు.

రాయవరపు ఆదినారాయణరావు



వీరయ్యకు పెద్ద కొడుకుమీద చాలా కోపం వచ్చింది. నాలుగు తన్నాలనుకున్నాడు. భార్య వారించింది. వాణ్ణి అడవిలో వదిలేసి పోదా మనుకుంటే తమ్ముళ్ళు, చెల్లెళ్ళు ఒప్పుకోలేదు.

"ఇప్పుడు మన ఆకలి తీరేదెలా? ఈ చుట్టు పక్కల పళ్ళ చెట్లేవీ వున్నట్టు లేదు. నీళ్ళు తాగి కడుపు నింపుకుందామన్నా— కొలను వెదకడానికి చీకటి. ఏంచేయాలో పాలుబోవడం లేదు!" అన్నాడు వీరయ్య దిగులుగా.

"నువ్వు తిండి గురించి ఆలోచిస్తున్నావు; నేను క్రూరమృగాల గురించి భయపడుతు న్నాను. రాత్రికి మన మిక్కడుండడం క్షేమం కాదు," అన్నది వీరయ్యభార్య.

క్రూరమృగాల పేరు వినగానే పిల్లలందరూ భయపడ్డారు.ఎలాగోఅలారాత్రంతాప్రయాణం చేసైనా సరే, ఆ అడవి నుంచి బయట పడా లని అందరూ నిర్ణయించుకున్నారు. అయితే ఎంత ప్రయత్నించినా సోమయ్యను నిద్ర లేపడం ఒక్కరి వల్లా కాలేదు.

"సోమరి వెధవ! వీడినిక్కడే వదిలి మన మంతా వెళ్ళిపోదాం," అన్నాడు వీరయ్య చివరకు విసిగిపోయి.కానీ కొడుకును ఒంట రిగా విడిచి పెట్టడానికి తల్లి ఒప్పుకోలేదు. తమ్ముళ్ళు, చెల్లెళ్ళు కూడా ఒప్పుకోలేదు.

ఈ విషయమై వాళ్ళు గొడవ పడుతూం డగా, చెట్టు కొమ్మల్లోంచి ఒక మూట కింద పడింది. బరువుగా వున్న ఆ మూటను విప్పి చూస్తే, అందులో వేల సంఖ్యలో వరహాలు న్నాయి.

"ఈ డబ్బుతో సీతాపురం వెళ్ళి, ఎకరాలకు ఎకరాలు పొలం కొనుక్కుని హాయిగా బ్రతక వచ్చు," అన్నాడు వీరయ్య.

"కానీ ఈ డబ్బెవరిదో మరి? చెట్టు మీద ఎవరైనా వున్నారేమో?" అని వీరయ్య భార్య, ఇంకా ఏదో చెప్పబోతూండగా, చెట్టు కొమ్మ ల్లోంచి ఒక మనిషి దభీమంటూ కిందికి దూకాడు. వాడు కారునలుపులో దృఢంగా వున్నాడు.

"ఈ డబ్బు నాది! కానీ నే పెట్టే నియమానికి ఒప్పుకుంటే, ఈ డబ్బును మీకిచ్చేస్తాను," అన్నాడా నల్లటిమనిషి.



దీనికి నల్లటిమనిషి కటువుగా, "నాతో ఇన్ని మాటలుండవు. బేరం కుదిరిపోయింది. మీరా డబ్బు తీసుకుని వెంటనే ఇక్కణ్ణించి వెళ్ళిపొండి," అన్నాడు.

"అది సరేలేవయ్యా! ఇంతకూ నువ్వు మా సోమయ్య నేంచేసుకుంటావో చెప్పు. అలాగే వెళ్ళిపోతాం," అన్నాడు వీరయ్య వేళా కోళంగా.

"చెబితే బాధపడతారు. మీరు తెలుసుకోక పోవడమే మంచిది," అన్నాడు నల్లటిమనిషి.

కానీ వీరయ్య చెప్పాలంటూ పట్టు బట్ట డంతో నల్లటిమనిషి, "మీరు భయపడతారని అసలు రూపంలో రాలేదు, నేనొక రాక్షసుణ్ణి. మనుషులు నాఆహారం. అయితే నీతి నియ మాలు పాటించే వాణ్ణి కాబట్టి, నా ఆహారాన్ని నేను కొనుక్కుని హాయిగా తింటాను," అన్నాడు.

"సరే, అదేమిటో చెప్పు?" అని అడిగాడు వీరయ్య.

"ఇక్కడున్న వాళ్ళలో ఒకరిని నా కప్పగిం చాలి," అన్నాడా నల్లటిమనిషి.

"ఎవరు కావాలో అడుగు!" అన్నాడు వీరయ్య.

నల్లటిమనిషి, సోమయ్యను ఎన్నుకున్నాడు.

"నేరక ఈ సోమరిపోతును ఎన్నుకున్నాడు. ఇది మా కుటుంబానికీ మంచిది," అని వీరయ్య మనసులో అనుకుని వెంటనే ఒప్పు కున్నాడు.

అతడి భార్యమాత్రం కంగారుపడి, "అలా వెంటనే ఒప్పేసుకున్నావేమిటి? ఈ మనిషె వరో, మన అబ్బాయినేం చేసుకుంటాడో అడిగి తెలుసుకోవద్దూ?" అన్నది.

ఇది విని వీరయ్య భార్య పెద్ద పెట్టున రోదించింది. వీరయ్య, రాక్షసుడికి డబ్బు తిరిగిఇచ్చేస్తానన్నాడు. రాక్షసుడందుకు ఒప్పు కోలేదు. అప్పుడా కుటుంబం వాళ్ళందరూ ఒకరి తర్వాత ఒకరుగా, "నన్ను తీసుకుని సోమయ్యను వదిలి పెట్టు," అన్నారు.

రాక్షసుడు తల అడ్డంగా వూపి, "మీరంతా బక్క చిక్కి వున్నారు. మిమ్మల్ని తింటే, నా కోరల పదును పాడవడం తప్ప ఆకలి తీరదు. ఈ కుర్రాడు కొవ్వు పట్టి మహ పసందుగా వున్నాడు. నాకు వీడే కావాలి!" అన్నాడు.

ఆ వెంటనే వీరయ్య కుటుంబమంతా ఒకే గోలగా ఏడ్వడం ప్రారంభించారు. రాక్షసుడు నవ్వుతూ, "ఏడవండి, మరింత పెద్దగా ఏడవండి, మీ ఏడ్పులకు వీడు నిద్రలేవాలి. నేను నిద్రపోతున్న వారిని తినను!" అన్నాడు.

అంతే! వీరయ్య కుటుంబం వారు ఏడ్పులు మానేశారు. రాక్షసుడు, సోమయ్య వంక చూస్తే, వాడింకా ఒళ్ళెరక్కుండా గుర్రుపెట్టి నిద్రపోతున్నాడు.

"వీడి వాటం చూస్తే తెల్లారే దాకా నిద్ర లేచేలా లేడు. చీకటి తెరలు తొలగేలోగా భోజనం ముగించాలన్నది, నా నియమం," అంటూ రాక్షసుడు తీవ్రమైన ఆలోచనలో పడ్డాడు.



బారెడు పొద్దెక్కితేగానీ సోమయ్య నిద్రలేవడు. అదీ వాడి అలవాటు. అందుకని, వాడి ప్రాణాలు దక్కినట్టే అని వీరయ్య కుటుంబం సంతోషించింది.

అయితే రాక్షసుడు తనప్రయత్నాలు మానలేదు. వాడు అడవిలోకి వెళ్ళి, నాలుగు ఏనుగులను రెచ్చగొట్టి అక్కడికి తీసుకు వచ్చాడు. అవి పెద్దగా ఘీంకరిస్తూ, చెట్టు చుట్టూ తిరిగాయి. అయినా సోమయ్య నిద్ర లేవలేదు.

రాక్షసుడు మరొక సారి అడవిలోకి వెళ్ళి, రెండు సింహాలను పట్టుకు వచ్చి వాటితోకలను మెలిపెట్టసాగాడు. బాధకు ఓర్చుకోలేక అవి అడవి దద్దరిల్లేలా గర్జించ సాగాయి. అయినా సోమయ్య కదలలేదు, మెదలలేదు. ఇది పని కాదని వాడు, రెండు అడవి పిల్లులను పట్టుకువచ్చి, వాటిని సోమయ్య పక్కన వుంచి, వాటి మధ్య పోరాటం పెట్టాడు. వాటి వికృత స్వరాలతో సోమయ్య గుర్రు కూడా కలిసింది.

చివరకు రాక్షసుడు తనే అసలు రూపం ధరించి జబ్బలు చరుచుకుంటూ, కుప్పిగంతులు వేస్తూ పెడబొబ్బలు పెట్టాడు. ఉహుఁ, సోమయ్య చలించలేదు!

చూస్తూండగానే తెల్లవారింది. రాక్షసుడు మనిషిరూపం ధరించి, వీరయ్యతో, "మీరు మీ గ్రామం వెళ్ళండి. ఏడాది తర్వాత మీ ఇంటికి వస్తాను. అప్పుడు ఈ నిద్రపోతును

నాకు అప్పజెప్పండి. అలా చేయకపోతే, అప్పుడు నా డబ్బు నాకు తిరిగివ్వాలి," అన్నాడు.

"అంతకాలం గడు వెందుకు? నీ డబ్బు ఇప్పుడే తీసుకో!" అన్నది వీరయ్య భార్య ఏడుస్తూ.

"ఆహాఁ, అలా కుదరనే కుదరదు. ఒకసారి బేరం అంటూ కుదిరిపోయాక, ఆ తర్వాత ఏమి చేయాలో శాసించేది నేను, మీరు కాదు!" అని రాక్షసుడు అక్కణ్ణించి వెళ్ళిపోయాడు.

ఆ తర్వాత కాసేపటికి సోమయ్య నిద్రలేచాడు. తల్లి వాడికి జరిగినదంతా చెప్పి, "కొంతకాలం పాటు నువ్వెక్కడైనా వుండి, ఏడాది గడిచాక రా!" అన్నది.

సోమయ్య ఆశ్చర్యపోతూ, "అమ్మా! ఏ డబ్బూ లేనప్పుడు నన్ను దగ్గరుండి బాగా చూసుకుని, ఇప్పుడు డబ్బువచ్చాక ఎక్కడికైనా పొమ్మంటావేం?" అని అడిగాడు.

"నువ్వు దగ్గరుంటే డబ్బు కూడబెట్టడం మావల్లకాదు, రాక్షసుడి డబ్బులోంచి ఖర్చు చేయవలసి వస్తుంది. అప్పుడు చిక్కుల్లో పడతాం. డబ్బు మనదంటూ కూడబెట్టక పోతే నిన్ను మేము దక్కించుకోలేము. అందుకని, కొన్నాళ్ళు నువ్వెక్కడో అక్కడ తిరిగిరా. ఈలోపల డబ్బు దాచి రాక్షసుడి బెడద వదిలించుకుంటాం. అప్పుడు మనం కలిసి వుండవచ్చు," అన్నది సోమయ్య తల్లి బతిమాలుతూ.

కానీ సోమయ్య, తల్లి మాటలు వినలేదు. వాడు తల్లిదండ్రులతోనే వుంటూ, సోమరితనాన్ని విడిచిపెట్టి కష్టపడి పనిచేయసాగాడు. దానితో వాడికి తిండి యావ తగ్గింది. అటు తిండి తగ్గి, ఇటు శరీర శ్రమ చేయడంతో, వాడు కూడా శరీరంలో కొవ్వు తగ్గి మిగతా వాళ్ళలా సన్నబడ్డాడు.

ఏడాది తర్వాత వచ్చిన రాక్షసుడు, సోమయ్యను చూసి, "వీడేనా వాడు!" అంటూ చీదరించుకుని, తన డబ్బు తాను తీసుకు వెళ్ళాడు.

రాక్షసుడి బేరం తమకు అన్ని విధాలా కలిసొచ్చిందని, వీరయ్య కుటుంబం వాళ్ళు సంతోషించారు.





# రాజు-రాజర్షి

కర్పూర దేశాన్ని పాలించే వసంతుడు నిజాయితీపరుడు. ఆయన తనను ప్రజా సేవకుడిగా మాత్రమే భావించుకునేవాడు. అందువల్ల, రాజులకుండే వైభవాలనేమీ ఆయన అనుభవించేవాడు కాదు.

కర్పూర దేశపు రాజాంతఃపుర భవనం చాలా పెద్దది. దానిలో యాభై గదులూ, ఒక నాట్యశాలా, ఐదు స్నానమందిరాలూ వుండేవి. నూరుమంది సేవకులూ, యాభై మంది పరి చారికలూ, ఆ భవనాన్ని శుభ్రంగా వుంచేవారు. ఇరవై మంది కాకలుతీరిన సైనికులు రాత్రిం బవళ్ళూ భవనానికి కాపలా కాసేవారు.

వసంతుడు రాజుకాగానే రాజాంతఃపురం కళాకేంద్రంగా మార్చబడింది. అక్కడ కళా కారులకు శిక్షణ ఇవ్వబడేది.దేశంలోనే కాక విదేశాల్లో ప్రసిద్ధి కెక్కిన కళాకారులు కూడా అక్కడికి వచ్చి, ఆ భవనంలో కొంతకాల ముండియువకళాకారులకుసంగీతం,నాట్యం, చిత్రలేఖనం, కవిత్వం లాంటి కళలలో శిక్షణ నిచ్చి వెళుతూండేవారు.

వసంతుడు కోట లోపల చిన్న ఇంట్లో వుంటూండేవాడు. ఇంట్లో విలువైన వస్తువు లేమీ వుండేవి కాదు. నెలనెలా ఇంటికి అవ సరం అయిన వస్తువులు కొనుక్కుంటూ, ఏడాది గడిచేసరికి ఆయన కొన్ని సదుపాయాలు చేసుకోగలిగాడు.

ఇలా వుండగా – వికల్పదేశపు రాజ కుమారి వినీలకు స్వయంవరం జరిగింది. వసంతుడు అక్కడికి వెళ్ళాడు. ఆయన అంద చందాలకు పరవశించి, వినీల వరమాలతో, ఆయన కంఠాన్ని అలంకరించింది.

వసంతుడప్పుడామె చేయి పట్టుకుని, "వికల్ప ప్రభువులకు నావిన్నపమేమిటంటే, ఈమె ఈ క్షణం నుంచీ నా భార్య. కాబట్టి ఆర్భాటాలేమీ లేకుండా, కట్టుబట్టలతో నాతో పంపండి. కానుకలు స్వీకరించడం నాకు



"అవును, వికల్ప ప్రభూ! కర్పూరదేశం ఆయన శక్తి సామర్థ్యాల వల్లనే శక్తివంతమై నిలబడింది. ఆ రాజ్యాన్ని నా కప్పగించారా యన. దానిని సంరక్షించడం కోసం, చిన్న తనం నుంచీ నేను శిక్షణ పొందాను. రాజు నయ్యాక నేను రాజ్యభారాన్నే తప్ప, రాజధ నాన్ని స్వీకరించ లేదు. రాజ వైభవాలకు అంగీకరించ లేదు. ప్రజాసేవకుగాను నెలకిం తని జీతం తీసుకుంటున్నాను. నా జీవితానికి తగిన ఇంట్లో వుంటూ, నా శక్తి కొద్దీ నెల నెలా అవసరమైన వస్తువులు సమకూర్చుకుం టున్నాను," అన్నాడు వసంతుడు.

ఇది విని అక్కడికి వచ్చిన రాజులందరూ పరిహాసంగా నవ్వి, "ఈ రోజు నుంచీ వినీల కర్పూరదేశ మహారాణి కాదు. కర్పూరదేశ మహా సేవిక!" అన్నారు.

వినీలతండ్రి కోపంగా, "వినీల నెంతోగారా బంగా పెంచాను. వైభవాలకు అలవాటుపడ్డ నాకుమార్తె, నీ వద్ద సుఖపడదు. ముందుగా నీసంగతి తెలియక పోవడంతో వినీల పొర బాటు చేసింది. నువ్వు విరాగివి, రాజర్షివి. వివాహ ప్రయత్నం చేసి, నువ్వు నా కుమార్తె జీవితాన్ని దుఃఖమయం చేశావు. ఇది నీకు తగునా?" అన్నాడు.

అందుకు వినీల అభ్యంతరం చెబుతూ, "నా నిర్ణయం తప్పుకాకూడదు. పాణిగ్రహణం కాగానే మా వివాహం జరిగిపోయింది. భర్త ననుసరించి వెళ్ళడం సంప్రదాయం. నేను నచ్చదు," అని ఆమె తండ్రికి వినయంగా చెప్పాడు.

ఇది విని కలవరపడిన వినీల తండ్రి, "బిడ్డలకు కానుకలివ్వడం మా సంప్రదాయం. నువ్వు కాదన కూడదు," అన్నాడు.

"ప్రజాధనాన్ని కానుకగా స్వీకరించడం, నా సంప్రదాయం కాదు, మీ వద్ద మీరు కష్ట పడి సంపాదించిన ధనం వుంటే, వినీలకు కానుకగా ఇచ్చుకోవచ్చు," అన్నాడు వసం తుడు.

"అయితే, నీకు నీ తండ్రి నుంచి సంక్ర మించినదంతా, ఆయన కష్టపడి సంపా దించినదేనా?" అని ప్రశ్నించాడు వినీల తండ్రి.

..భర్తతో వెళుతున్నాను. ఆయనను నాకు అనుగుణంగా మార్చుకోగలను. లేదా నేనే ఆయన అడుగు జాడలలో నడుస్తాను. మేము అన్యోన్యంగా వుండగలమని మీకు మాట ఇస్తున్నాను. కలవరపడకండి," అన్నది తండ్రితో.

వసంతుడు, వినీల కర్పూరదేశం చేరుకున్నారు. అక్కడ వినీల తమ ఇంటిని చూసి చిన్నబుచ్చుకుని, "ఇది మహారాణి నివసించ తగ్గ ఇల్లేనా? ఇంతకంటే పెద్ద భవనం మీకు దొరకలేదా?" అని భర్తను అడిగింది.

దీనికి వసంతుడు నవ్వి, "దేశాన్నేలేది పురుషుడైతే మహారాజు. స్త్రీ అయితే మహారాణి. నువ్వు మహారాణివి కాదు. మహారాజు భార్యవు. ఆ విషయం మరిచిపోకు. నేను మహారాజును. నేనుండే భవనానికి నెలనెలా అద్దెకట్టాలి. పరిచారికలకూ, కాపలా భటులకూ జీతాలిచ్చుకోవాలి. నా నెలజీతంతో ఇంతకంటే పెద్ద ఇంటిని, నేను భరించలేను," అన్నాడు.

వినీలకా మాటలు రుచించలేదు. కానీ, అందగాడైన భర్త మీది ప్రేమతో అన్నీ సహించింది. ఆ ఇంట్లో ఒక పరిచారకుడు, పరిచారిక, కాపలాభటుడు — ఈ ముగ్గురి సాయంతోనే అన్నింటికీ సర్దుకుంటూ, ఆమె రోజులు గడపసాగింది. ఒకనాడామె వసంతుడితో, "మీరు లేనప్పుడు నాకుచాలా విసుగ్గా వుంటున్నది.ఆటపాటలు లేవు. చెలికత్తెలు లేరు. ఏ విలాసాలూ లేవు. సమయం చాలా చప్పగా గడిచిపోతున్నది," అంటూ మొరపెట్టుకున్నది.





"తీరిక సమయాన్ని వృథా చేసుకోకు. చిన్నదైనా మన గ్రంథాలయంలో,ఎన్నో కొత్త గ్రంథాలున్నవి, అవి చదువు. కొత్త విద్యలు నేర్చుకో. ఆటపాటలతో, ఆర్భాటాలతో, వృథా కబుర్లతో సమయం వృథా చేసుకున్నాక – నేను పక్కన వున్నా నీకు తప్పక విసుగ్గా వుంటుంది," అన్నాడు వసంతుడామెతో.

అలా ఒక సంవత్సరం గడిచింది. వినీల ఈ జీవితానికి అలవాటు పడింది కానీ, భర్త దగ్గర లేనప్పుడామెకు అసంతృప్తిగా వుండేది.

వసంతుడు గొప్ప పరిపాలనాదక్షుడు. ఆయన మంత్రులను, రాజోద్యోగులను అప్రమత్తులుగా వుంచుతూ, తన శాసనాల వల్ల ప్రజలకు మేలు జరిగేలా చూసేవాడు. సమర్థుడైన రాజే నెల జీతానికి పనిచేయడంతో, మిగతా వారు అంతకంటే తక్కువ జీతానికే పనిచేయసాగారు.

ఇలా వుండగా, ఒక రోజున విన్యాసుడనే తాపసి, వసంతుణ్ణి చూడవచ్చాడు. వసంతుడాయనకు సకల మర్యాదలూ చేసి గౌరవించాడు. ఆయన వసంతుణ్ణి మెచ్చుకుని తను వచ్చిన పని చెప్పాడు:

విన్యాసుడు చాలా ఏళ్ళుగా హిమాలయాల్లో తపస్సు చేసి, అంతులేని తపోబలాన్ని సంపాదించాడు. దేవుడాయనకు ప్రత్యక్షమై, "తపోధనా! నువ్వు ప్రజాక్షేమాన్నే కోరే నిజాయితీపరుడైన ఒకే ఒక్క రాజు కోరిక తీర్చివచ్చాక, నీకు మోక్షం ప్రసాదిస్తాను, వెళ్ళు!" అని చెప్పాడు.

అలాంటి రాజులెక్కడున్నారా అని వెదుకుతూ బయల్దేరిన విన్యాసుడికి ఇంతవరకూ, ప్రసేనజిత్తు అనే రాజర్షి తప్ప ఇంకెవరూ దొరకలేదు.

అయితే, ప్రసేనజిత్తు, విన్యాసుడితో, "మహాతపస్వీ! నేను రాజర్షిని. నాకే కోరికలూ లేవు. నా రాజ్యం సదా సుభిక్షంగా వుండాలన్న దొక్కటే, నా కోరిక. ఆ కోరిక ఎంతవరకు సమంజసమో, నాకు తెలియదు. అయితే, కర్పూర దేశాన్నేలే వసంతుడు నిజాయితీలో నన్ను మించినవాడని, నా అభిప్రాయం. తమరాయనను కలుసుకున్నాక, ఏదో ఒక నిర్ణయానికి రావచ్చు," అన్నాడు.

ఆ కారణంగా విన్యాసుడు, వసంతుడి వద్దకు వచ్చాడు.

ఇది విన్న వసంతుడు కొద్దిసేపు ఆలోచించి, "మునివర్యా! నా రాజ్యాన్ని సుభిక్షంగా వుంచడం, నా బాధ్యత. ఆ బాధ్యతను పరిపాలనా దక్షతతో సాధిస్తాను తప్ప, దేవుడికి అప్పగించను. అయితే, తీరిక సమయాల్లో విలాస జీవితం గడపాలన్న కోరిక, నాకున్నది. ఆ కోరిక తీరితే-నా భార్య కూడా సంతోషిస్తుంది. తమరు నన్ను అర్హుడుగా భావిస్తే, ఆ కోరిక తీర్చగలరు," అన్నాడు.

ఈ మాటలకు సంతోషించి విన్యాసుడు, వసంతుడికొక బొమ్మనిచ్చి, "రాజా, ఈ రోజు నుంచీ ఈ బొమ్మ నీ వడిగిన కోర్కెలు తీర్చుతుంది. ఇది నీ ఒక్కడికి మాత్రమే ఉపయోగపడుతుంది సుమా!" అన్నాడు.

వసంతుడాశ్చర్యంగా, "మునివర్యా! మీ వరం ప్రసేనజిత్తుకే తప్ప, నాకు లభించదన్న నమ్మకంతో, నేనా కోరిక కోరాను. నిస్వార్థపరత్వంలో ప్రసేనజిత్తును నేను మించలేను. ఏ కోరికలూ లేని ఆయనను కాదని, నాకెందుకు ఇటువంటి వరమిస్తున్నారు?" అని అడిగాడు.

ఇందుకు విన్యాసుడు చిరునవ్వు నవ్వి, "ప్రసేనజిత్తు రాజర్షి! ఆయనకు ఏ కోరికలూ లేవు. కోరికలు లేని వాడు విలాసాలకు దూరంగా వుండడం విశేషం కాదు గదా! ఇక నువ్వో — నిజాయితీ గల సమర్థుడైన రాజువు మాత్రమే! నీవు విలాస జీవితంపై కాంక్ష వున్నప్పటికీ, రాజధనం జోలికి వెళ్ళకపోవడం వల్ల, ఆయనకంటే అధికుడివయ్యావు. ఎందువల్లనంటే, విలాస జీవితంపై కాంక్ష వుండీ, రాజుగా కావాలనుకుంటే ప్రజాధనం వెచ్చించగల హక్కు వుండీ కూడా, నువ్వు ఎంతో నిగ్రహం చూపావు. నీ నిజాయితీ మెచ్చుకోతగ్గది. అందుకే, ఈ వరం గ్రహించేందుకు నువ్వు అర్హుడివయ్యావు!" అన్నాడు.

ఆ తర్వాత వసంతుడు, విన్యాసుడిచ్చిన బొమ్మసాయంతోవైభవవిలాసాలననుభవిస్తూ, మిగతా సమయంలో ప్రజా క్షేమం కోరే పరిపాలనాదక్షుడైన ప్రభువుగా పేరుపొందాడు.



# ఫోటో వ్యాఖ్యల పోటీ : : బహుమానం రు. 100/-

ఈ పోటీల వ్యాఖ్యలు 1996 మార్చ్ నెల సంచికలో ప్రకటింపబడును.


S.G. Shesagiri


S.G. Shesagiri

✱పై ఫోటోలకు సరియైన వ్యాఖ్యలు ఒక్క మాటలో గానీ, చిన్న వాక్యంలో గానీ కావాలి. (రెండు వ్యాఖ్యలకూ సంబంధం ఉండాలి.) ✱ జనవరి నెల 15వ తేదీలోగా వ్యాఖ్యలు మాకు చేరాలి. ✱మాకు చేరిన వ్యాఖ్యలలో అత్యుత్తమంగా ఉన్న సెట్టుకు (రెండు వ్యాఖ్యలకు కలిపి) రు. 100/-లు బహుమానం. ✱వ్యాఖ్యలు రెండూ పోస్టుకార్డు పైన రాసి, ఈ అడ్రసుకు పంపాలి: చందమామ ఫోటో వ్యాఖ్యల పోటీ, మద్రాసు - 600 026.

## నవంబర్ నెల పోటీ ఫలితాలు

మొదటి ఫోటో : ఎంత దూరమైనా నడకే కొందరికి...

రెండవ ఫోటో : ఏనుగెక్కే భాగ్యమెందరికి?

పంపినవారు : శింగరాజు వెంకట హనుమంతరావు

22/2/88(3) నాంచారమ్మ కాలనీ, కందుకూరు - 523105. ప్రకాశం జిల్లా (ఆం.ప్ర)

బహుమతి మొత్తం రు. 100/- నెలాఖరులోగా పంపబడుతుంది.

## చందమామ

ఇండియాలో సంవత్సర చందా : రూ. 60.00

చందా పంపవలసిన చిరునామా :

డాల్టన్ ఏజన్సీస్, చందమామ బిల్డింగ్స్, వడపళని, మద్రాసు - 600 026

Printed by B.V. REDDI at Prasad Process Private Ltd., 188 N.S.K. Salai, Madras 600 026 (India) and Published by B. VISHWANATHA REDDI on behalf of CHANDAMAMA PUBLICATIONS, Chandamama Buildings, Vadapalani, Madras 600 026 (India). Controlling Editor: NAGI REDDI.

PARLE

# మరవద్దు ఆ 'జీ' తత్వం ఎప్పుడూ మనం... జీవితాంతం

## జీవిత పరమార్థం ఇదేలే ఇదే

జీవితంలోని యీ దారుల్లో వేసే ప్రతి అడుగూ పరీక్షే నిజానికి. ఏ దారుల్ని అనుసరిస్తాం, వేటినుంచి విముఖలమౌతాం అనేదే మన వ్యక్తిత్వానికి గుర్తు. ఏదీ కోరకుండా, ఏమీ ఆశించకుండా, ఎవరికైనా తోడ్పడటం. నిజానికి నిజాయితీగా బతకడం అంటే యిదే. మరవద్దు ఆ 'జీ' తత్వం మనం... ఎప్పుడూ మనం, జీవిత పరమార్థం ఇదేలే ఇదే. ఏళ్ళతరబడిగా భారతదేశంలో అన్నింటికన్న ఎక్కువగా కోరుకుంటూన్న బిస్కట్.




• రుచికరం, నిజంగా శక్తిమయం. •

everest/95/PPL/109 tl

CHANDAMAMA (Telugu) January 1996 Regd. No. M. 4854